

ప్రసాద్ ఇంటర్నేషనల్స

# తిరపతి

వీరమాచనేని ప్రసాద
దాసరి నారాయణరావు

KalaMandir

SARADA

లోకేశ్వరీ ఆర్ట్స్ పిక్చర్స్

# ఆడంబరాలు అనుబంధాలు



నిర్మాత: **A.K.V. ప్రసాద్**

దర్శకత్వం: **C.S. రావు** B.A.(Litt)

ఛాయాగ్రహణం: గా.K.రాము

సంగీతం: చక్రవర్తి

ఆంధ్ర, నైజాం: శ్రీ ఫిలిమ్సు

సీడెడ్: జయలక్ష్మి పిక్చర్స్

మైసూర్: సుధా చిత్ర

Veekay

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాదుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 23-8-'74
శ్రీ ఆనందనామ సం. అధిక భాద్రపద మాస శు షష్ఠి
**సంపుటము : 67 సంచిక 52**
సంపాదకుడు .
శివలెంక రాధాకృష్ణ
*ఆంధ్రపత్రిక కార్యాలయము*
*గాంధీనగరం, విజయవాడ-3.*
సంవత్సరం చందా - రు 31-20 పై.
ఆరుమాసాల చందా - రు 15-60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయసూచిక



ముఖచిత్రం : ...



# ఉత్తరాలు

### శ్రద్ధాంజలి!

భయదోదాత్త విశేష వేషనటనా దిగ్భ్రాంత
సర్వాంధ్ర సం
చయ నక్షత్రము రాలిపోయినది! దిక్సౌ
భాగ్యమే పోయె—మా
నయనాంభ కణజాల మంజలిగ గొన్నామయ్య!
హో దేవ !—స
కయు నీవే నటరత్నమైన ఘను రంగారావు
కాంజేయుటన్!

హో నటరత్నశేఖర! మహోజ్జ్వల తావక వేష
ధరణల్
నీ నటనా కళానుభవ నిత్యనవీనత శాశ్వతంబుగా
కానగ గోరి ఇంద్రసభకై నినుపిల్చిరో యేమొ
దేవతల్!
నీ నవ కీర్తి చంద్రికలు నింపుట చెల్లనె ?
దిగ్ది గంతముల్!

దిక్కుల్ పిక్కటిలంగ భీకరముగా "ధిక్కారముల్
సైపకే
ధిక్కారార్బటిచేసె "గగ్గయ" యశస్తేజస్వి
వేమూరి! ఆ
ప్రక్కన్ ప్రమోసెను "గుర్జనాయడు" న
వహ్వా! వారలన్ మించుని
ఉక్కుంబోకడఁ జాపంగల్గునరుండీ ఉర్వీ స్థలిన్
గల్గునే ?

ఇక నీ ఆంధ్రమునందు వేరొకఁడు లేనేలేఁడు!
నీ వంటి స
త్ప్రకటాత్యద్భుత పాత్ర పోషణ కళా దవురేయ
చారిత్ర నా
టక మర్మజ్ఞుడు! భాషణాపథ నిరాటంకార్భటీ
సంభ్రమా
ధిక! "యస్వీ వర రంగరాయ!" ఘనకీర్తీ! నీకు
శ్రద్ధాంజలుల్!!

తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు
(కైకలూరు)

### నభూతో న భవిష్యతి!

నటరాజు నాట్యం
నిలిచింది!
మృత్యువు వాతబడి
నిండువెత్తు మానవత్వం
కోల్పోయింది చైతన్యం!
హావభావాలను
దివ్యంగా చూపించే
నిలువుటద్దం
బద్దలయింది!
ప్రేక్షకుల కళ్లముందు
అంధకారపు తెర దిగింది!
యస్.వి—
యశస్విలేడు!
మరొక యస్.వి
యశస్విరాడు!
నభూతో న భవిష్యతి!

—కొడిమెల శ్రీరామమూర్తి (ఏలూరు)

* * *

నీ హృదయ స్పందన స్పందన
కూర్చె వేదన సర్వాంధ్ర ప్రేక్షక
గుండె గుండెన!
నీ రూపలోప కళా జగతి!
నీరులేని చేపల గతి రీతి!
నీవు నిలచిన కళాజగతి వైభవము,
ధరించే నేడు శోభ రహిత వైధవ్యము!
నీ అనుపమాన నటనా వైదుష్యము
తొలగించె నాడు సమాజ కాలుష్యము!
నీ గంభీర దేహం మోసిన సినీ రంగం, కి
నిరూప దేహహీనం చేకూర్చెదు ఖ భంగం!
సర్వ ప్రేక్షక ఏక గరళ గాత్రము,
నీ నట నాకౌశల్య గుర్తింపు గీతము!
కళామ తల్లి కరుణ కరాలయందు
కళకళలాడిన హో! నట సార్వభౌమా!
నీ పరలోక పయనము మా హృది విలపింపై
శోకగీతాల నాలాపించె! అవునా?
నీ జీవ అంతిమ క్షణ కిదే
మా అక్షరాకృతిగల అశ్రుతర్పణ!
నీ ఆత్మ శాంతికై చేసెదము
దైవకృపాకాంక్షితులమై అర్చన!

సాహితీ మిత్ర దీప్తి కార్యకర్తలు (జగిత్యాల) ●

స్వాతంత్ర్య దినోత్సవం యొక్క ప్రాముఖ్యతను గురించి గత 26 సం॥ల నుండి ఎందరో నాయకులు చెప్పవలసింది మిగలకుండా చెప్పేశారు. ఇక నే చెప్పవలసింది ఏమీ లేదు. కాబట్టి నా ఉపన్యాసం ముగిస్తున్నాను. జైహింద్






'దర్శకత్వం **పట్టు**
సంగీతం సత్యం
మాటలు. ఎన్ ఆర్ నంది
నిర్మాతలు
**మురుగన్, కుమరన్, శరవణన్, బాబు**

విజయా లింటజ్

# ఫాలాక్షుని డైరీ




## ఒక స్త్రీ, సినీ నిర్మాతల హత్యలు!

21వ తేదీన మధ్యాహ్నం బొంబాయి చౌపతీ ప్రాంతంలో బీచ్‌లో "ట్వెంటీ సెవెన్ డవున్" అనే సినిమా నిర్మించి, రాష్ట్రపతి బంగారు పతకాన్ని పొందిన నిర్మాత అవతార్‌కృష్ణ కపుల్ అనే ఆయన శవం, 23 ఏళ్ల శోభన అనే అమ్మాయి శవం పోలీసులకు దొరికాయట. శవాల కళ్లల్లోంచి రక్తం వచ్చిన చారిక లున్నాయట. కపుల్ న్యూయార్క్ విశ్వవిద్యాలయంలో ఫిలిం ప్రొడక్షన్ పట్టా తీసుకున్నాడట. ఆయన భార్య విదేశీ స్త్రీట. ప్రస్తుతమామె న్యూయార్క్‌లోనే ఉంటోందట. వీరిద్దరినీ కలిపో, విడివిడిగానో హత్య జరిగినది! వగైరాల కోసం పోలీసు విచారిస్తోందిట.

## హత్యలూ — ఆత్మహత్యలూ!

కుటుంబ కష్టాలను తప్పించుకునే మార్గం లేక ఎదిరించే శక్తి లేక బల్గాంలో ఒకావిడ తన ఏడేళ్ల కూతురిని, ఇద్దరు కొడుకులను నూతిలో విసిరి, తానూ దూకేసిందట. ఇది చూసి సహాయం చేయబోయి పరుగునవచ్చినవాళ్ల సహాయం అందేలోగా వాళ్లు నలుగురూ చనిపోయారట.

* * *

ఉద్యోగం లేక, నిరుద్యోగాన్ని భరించ లేక, కుటుంబ భారాన్ని మోయలేక, ఆర్థిక ఇబ్బందులను తట్టుకోలేక సికిందరాబాద్‌కు చెందిన 40 ఏళ్ల సత్యనారాయణ అనే ఒకాయన తన కుటుంబముతో సహా తిరుపతి వచ్చి సత్రవులో ఓ రూము తీసుకుని, కూడా తెచ్చుకున్న విషాన్ని తన నలుగురు పిల్లలకు, భార్యకు పెట్టి తానూ తిన్నాడట. ఫలితంగా ఓ చిన్న పిల్ల వెంటనే చనిపోవడం, సత్య నారాయణ, మరో ముగ్గురు పిల్లలూ ఆసుపత్రికి వెళ్లే దారిలో చనిపోవడం, ఆయన భార్య చికిత్స జరిగేలోపున చనిపోవడం జరిగిందట.

## కంకరరాళ్లతో కానిస్టేబులు హత్య!

కొందరు వ్యక్తులకు వారంటు అందించడానికి మారప్పన్, మార్టిన్ అనే ఇద్దరు కానిస్టేబుల్స్ "కోటవాడి" అనే గ్రామానికి వెళ్తే, ఆ వూళ్లో కొందరు వ్యక్తులు వారికి కంకర రాళ్లతో స్వాగతం పలికారట. ఈ స్వాగతం పాలు కాస్త ఎక్కువైనందువల్ల మారప్పన్ చనిపోయాడట. మార్టిన్ విషయం ఇంకా చెప్పలేట్లేదట.

## తన్నబోతే తల పగిలింది!

పూనాలోని స్థానిక కాలేజీలో విద్యార్థి నాయకుల ఎన్నికల్లో గెలిచిన ఓ విద్యార్థి నాయకుణ్ణి అభినందిస్తూ అతని స్నేహితులంతా గంతులు వేశారట. జె. పి. షిండే అనే విద్యార్థి గప్పున ఎగిరి కాలుతో ఓ స్నేహితుణ్ణి సాచి తన్నాడట. అవతలి కుర్రాడు లాఘవంగా అతన్ని పట్టుకున్నాడట. షిండే మళ్లీ అదేలా ఎగిరి తన్నేసరికిసారి

ఆ కుర్రాడు పట్టుకోలేక వదిలేశాడట. దాంతో షిండే తూలిపడ్డాడట అతని తల కాంక్రీటు గోడకు తగిలి, వెంటనే అక్కడికక్కడే షిండే చనిపోయాడట. ఇది మొన్న 20వ తేదీన జరిగిందట.

**పరీక్ష హాల్లో బాంబుల ప్రేలుళ్లు!**

22వ తేదీన గయలోని గౌతమ బుద్ధ కాలేజీలో పరీక్షలు హారుస జరుగుతుండగా ఉన్నట్టుండి ఓ బాంబు ఢామ్మని ప్రేలిందట దాంతో ఓ పరీక్షాధికారికి, ఓ ప్యూనుకు దారుణమైన దెబ్బలు తగిలాయట క్రితం రాత్రి కూడా ఆ కాలేజిలో ఓ బాంబు ప్రేలిందట 22వ తేదీన ప్రిన్సిపాల్‌గారింట్లో మరో బాంబు ప్రేలిందట— కిమర్థమేతత్పర్యం!!

**టెలివిజన్‌లో ఆత్మహత్య!**

ఫ్లోరిడాకు చెందిన 'సరసోటా'లో టెలివిజనులో వార్తలు చదివే 29 ఏళ్ల క్రిస్టిన్‌చబ్ బక్ అనే అమ్మాయి మొన్న 15వ తేదీన టెలివిజనులో వార్తలు చదువుతూ చదువుతూన్నట్టుండి పక్కనున్న డ్రాయర్లోంచి పిస్టలు తీసి తన చెవర కణత మీద ఢాం ఢామ్మని ప్రేల్చుకుందట.

**కుటుంబ నియంత్రణ స్టాంపు!**

స్త్రీలు గర్భం వద్దనుకుంటే ఉపయోగించుకోడానికి కుటుంబనియంత్రణ మార్కు చైనా పనిపెట్టిందట. ఈ మందు ఓ స్టాంపు బిళ్లలా ఉంటుందట. ఈ స్టాంపులాంటి బిళ్లను స్త్రీలు రోజుకొకటి అసుపిపాలట. పిల్లల ద్వసుపంటేనే ఎన్మండీ!

**ముసలితనం పోగొట్టే మందు!**

డోవర్ (న్యూజర్సీ)కి చెందిన డాక్టరు హెర్బర్ట్ బోసిన్‌గారు వృద్ధాప్యాన్ని ఆపి, ఉత్సాహాన్నిచ్చే ఓ మందు కనిపెట్టారట. వృద్ధాప్యంలో సర్వసాధారణంగా వచ్చే అలసట, నిరుత్సాహం, నీరసం వంటి వాటి నీ మందు రూపుమాపుచేస్తుందట— మైడోస్టేంగ్‌మ్ట్టేకిట్పుస్ట్?




# ఏదినిజం

## యర్రంశెట్టి గోగారావు



ప్రేమికులకు పరమప్రియమై, చోరులకు కంటకప్రాయమై; చల్లని వెన్నెల కురిపించే రేరాజు నైట్‌డ్యూటీ చేసి చేసి అలసిపోయి నిజమైన వాచ్‌మన్‌లా నిద్దర్లోకి జారుకున్నాడు. చంద్రుని కవ్వింపులతో నీలాకాశాన్నందు కోవాలని తాపత్రయపడి ఎగసి, ఎగసి శక్తిచాలక స్వప్నంలో గాలిమేడలుకట్టి, నిజావస్థలో తినటానికి అన్నం లేకపోయినా త్రాగటానికి నీరైనా అందుబాటులో లేని అవిటివానిలా చప్పగా చల్లారిపోయేడు సముద్రుడు. ఎండ తెండల మలమలమాడ్చు సూర్యుడు తీవ్రగాంటువ్వని సగటుగుమాస్తాలా తప్పదన్నట్లు పగలు డ్యూటీకి జాయినయిపోయేడు కమలాలు సంతోషంగా విచ్చుకుంటున్నాయి, లాటరీ తగిలిన కుటుంబంలోని మనుషుల ముఖాల్లా. పక్షులు కిచకిచా రావాలతో మేతకు బయల్దేరాయి, పల్లెజనం పొట్టకూటికై పనిపాటలకు బయల్దేరినట్లు.

పల్లెకాపులు పాలచెంబులు పట్టుకుని పాలాలు వెళ్తున్నారు ఆడవాళ్లు కళ్లాపులుచల్లి, ముగ్గులుపెట్టి వూరిచెరువునుండి నీళ్లు పట్టుకెళ్లతున్నారు పరాచికాలాడుకుంటూ. ప్రొద్దుటేలేచే అలవాటులేనికుర్రాళ్లు ముసలాళ్లు కమ్మని కలలుకంటూ వూహాలోకాల్లో సంచరిస్తున్నారు పసిపిల్లలు ఆకలేసికాబోలు ఏడ్పులు మొదలెట్టారు. ఆకలేస్తోందని చెప్పటానికి మాటలు రాక.

అది పల్లెటూరనటానికి వీలులేదు సరికదా పట్టణమనటానికి అసలేలేదు మధ్యస్థంగా ఉంది. అది ప్రభాత సమయమే ఐనా అన పని అదే కాబట్టి, నిన్న మిగిలిపోయినవికాపలు అమ్మకం మొదలు పెట్టాడు ఐస్‌ఫ్రూట్‌కుర్రాడు, "ఐస్‌ఫ్రూటంటూ" పన్నెండేళ్ల సుబ్బారావు ఐస్‌ఫ్రూట్‌కొన్నాడు, గత రాత్రిదాచు కానని లోకిస్తే, వాళ్లమ్మ వెంకాయమ్మగారు రి పచేంగగా, వ స్తనస్నగారు రామంగారిచ్చినపదిపైసల మొత్తంలోని సగభాగంతో తినటంకోసం కొన్నాడు కాబట్టి తినటం మొదలెట్టాడు. కమల పరుగెత్తుకుంటూవచ్చింది. సుబ్బారావు దగ్గరికి తన క్రొత్త గౌనును చూపించాలని

"కమ్మా, నేను ఐస్‌ఫ్రూట్ తింటున్నాను. నీకు లేదోచ్" తొలిసారిగా ఎవరెస్ట్ ఎక్కిన ఘనుడిలా అన్నాడు సుబ్బారావు

"ఛీ ఛీ. ఐస్‌ఫ్రూట్ తినకూడదు సుబ్బీ" అంది పరంధామయ్య ఈశ్వరమ్మ గార్ల ఏకైకప్రాణం అయిన కమల.

"సుబ్బీ అన్నావంటే తన్నురాను జాగ్రత్త" బెదిరించాడు.

"యేం నన్ను 'కమ్మా' అనలేదా?" అంది కమల కళ్లను గుండ్రంగా త్రిప్పుతూ "యేం జేస్తావ్ 'సుబ్బి' 'సుబ్బి'. 'సుబ్బీ' అని పారిపోయింది తన క్రొత్త గౌనుని చూపించి ఎలాగుందో అడగకుండానే.

'కమ్మా'.. 'కమ్మా' అంటూ కమల వెనకాల బడ్డాడు సుబ్బారావు సుబ్బారావు కన్నా నాలుగు సంవత్సరాలు చిన్నదైన కమల పరుగెత్తలేకపోయింది. సుబ్బారావుకి దొరికిపోయింది. సుబ్బారావు నాలుగు వాయించేశాడు.

"అమ్మా సుబ్బారావేమో" అంటూ కూని రాగాలుతీస్తూ వెళ్లిపోయింది. ఇంతలో వెంకాయమ్మగారు 'ఒరేయ్ సుబ్బీ' అని పిలవటంతో ఇంట్లోకి పరుగెత్తాడు ఐస్‌ఫ్రూట్ అవతల పారేసి తిడుతుందేమో నన్న భయంతో.

వీళ్లిద్దరిళ్లు ఎదురెదురుగా ఉండటం మూలాన

# ఏది నిజం ?

చిన్నప్పటినుంచీ కలసి తిరగటం, కొట్టుకోవటం, తిట్టుకోవటం అలవాటయిపోయింది. సుబ్బారావు నాన్నగారు పట్టణంలో ఒకాఫీసులో హెడ్ క్లర్క్. పరంధామయ్యగారు వ్యాపారం నడుపుతున్నారు. రెండు సంసారాలూ బాగా ఉన్నవే. చీకూ, చింతా లేనివే. ఏకైక సంతానాలు మూలంగా సుబ్బారావు, కమలలు గారాబంగా పెరుగుతున్నారు.

సుబ్బారావు, కమలలు ప్రతిరోజూ కలిసే స్కూలికి వెళ్ళేవారు స్కూలునుంచి వచ్చేటప్పుడు దార్లో పోట్లాడుకుని "నేను నీ జట్టుండను . పో" అని ఒకరికొకరు తిట్టుకునేవారు. అలవాటు ప్రకారంగా మరురోజు స్కూలుకు కలిసే వెళ్ళేవారు. ఎప్పుడూ పేచీలతోనే గడిపేవారు "పిల్లిద్దరికి పెళ్ళి చేసేస్తే పోట్లాడుకోరు" అని ఇరు కుటుంబాల వాళ్ళూ నవ్వుతూ అనుకునేవారు.

ఆరోజులు గడిచాయి. సుబ్బారావు కాలేజీలో బి యస్సి. ఆఖరి సంవత్సరం చదువుతున్నాడు. కమల హైస్కూలులో సెన్త్ క్లాస్ చదువుతూంది "అనురాగానికి నాంది ద్వేషమంటారు" అందుకనే కొబోలు ఎప్పుడూ కీచులాడుకున్నా ఒకరి మన సులో ఒకరికి యిష్టం ఏర్పడింది. ఆ ఇష్టమే యుక్తవయస్సు లొచ్చాక అనురక్తిగామారిందేమో ?! అదే నిజం కావచ్చు. పెరిగి పెద్దైనా కలిసి చదువు, సినిమాల గురించి వాదాలూ జరుగుతుండేవి పిల్లిద్దరి మధ్యా

"ప్రతీ మనిషిలోనూ ఏవో కొన్ని అభిరుచులు, కొన్ని అభిప్రాయాలనేవి ఉంటాయి" అలానే సుబ్బారావు, కమలలకుకూడా కొన్ని అభిప్రాయాలున్నాయి.

"ప్రేమించుకున్నవాళ్ళు పెళ్ళి చేసుకోకూడదు." ఇది సుబ్బారావు అభిప్రాయం "ప్రేమించుకున్న వాళ్ళు పెళ్ళి చేసుకుంటే ఒకరి కనుగుణంగా ఒకరు మారి సంసార జీవితం ఎంతో అన్యోన్యంగా సాగు తుంది" ఇది కమల అభిప్రాయం. కమలకు స్వత స్సిద్ధంగా ఈ అభిప్రాయంలేదు. పత్రికల్లోనూ, నవల ల్లోనూ చదివింది. సినిమాల్లో కూడా చూసింది ప్రతీ సినిమాలోనూ హీరో, హీరోయిన్లు ప్రేమించుకుంటూ దెబ్బలాడుకుని కలిసుండో విడిపోయో ప్రేమించుకుంటారు. ఎవరినో మధ్యలో అడ్డుపడినా చివరికి పెళ్ళిచేసుకుంటారు. అందుకనే సుబ్బారావుతో తన వివాహం గురించి, భావి జీవితం గురించి కలలు కనేది. కమలిలా కలలు కనడానికి కమల తల్లి తండ్రులే కారణం. వాళ్ళకు సుబ్బారావుని అమె అల్లుడిగా చేసుకోవాలనే అభిప్రాయ ముంది.

సుబ్బారావు పరీక్షలయి పోయాయి. కమలవి కూడా అయిపోయినట్టే. సుబ్బారావు పాసైతే ఆ కాలేజీతో సంబంధం తెగిపోతుంది. సుబ్బారావు చదివే పరిస్థితిలో లేడు. చదవలేనని గట్టిగా చెప్పే యాలనుకున్నాడు. ఎందుచేతంటే ఎంత చదివితే మాత్రం ఏం ఉద్యోగాలున్నాయి ?

ఇంతలో రిజల్ట్సు తెలిశాయి. సుబ్బారావుకి కెమిస్ట్రీ మిగిలిపోయింది. అందుగురించి పై చదువుల విషయమై వాదమేమీ జరగలేదు కమల సెన్త్ క్లాస్ పాసయ్యింది. పాసవటంలోనే మాన్పించేశారు కమ లని పై చదువులకు వెళ్ళనివ్వకుండా

"ఆడపిల్లలకు పెద్ద చదువులు అనవసరం. ఎంత చదివినా మొగుడికి వండిపెట్టటమేగా. ఉద్యోగం చేయాల్సిన అవసరం ఉంటే చదవచ్చు. చదువుకి అంతేమిటి ? చదువులో సంస్కారం పెరుగుతుందనుకుంటే అది పొరపాటే అసలు మనిషిలో సంస్కారమంటూ ఉంటే చదువే అక్కర లేదు. ఎక్కువగా చదివితే ఉన్న సంస్కారం కూడా పోతుంది పైగా నవనాగరికత పేరిట వెర్రితలలు వేస్తుంది" ఇది కమల తండ్రిగారి అభిప్రాయం.

"ఆడపిల్లలకు చదువు అక్కర లేదనుకోవటం పొరపాటు. ముఖ్యంగా మన భారతదేశం వెనుకబడి ఉండటానికి గల కారణం .. మహిళలకు చదువు తక్కువ కాబట్టే. ప్రాథమిక పాఠశాల చదువు తోనే ఆపేస్తారు ఆడపిల్లలని. కనీసం చాకలి పద్దైనా సరిగా వ్రాయలేరు పెళ్ళయ్యాక మొగుడెక్కడికైనా వెళ్ళి ఉత్తరం వ్రాస్తే చదువుకోనూలేరు. నాగరి కత పేరిట నవనాగరికత ముసుగులో వెర్రి వేషాలువేసే స్త్రీలని ఉదాహరణగా తీసుకుంటారే గానీ మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఎందుకు తీసుకోరు ? ఇది కమల తల్లిగారి అభిప్రాయం. వీరిద్దరి భేదాభిప్రాయాలతో కమల చదువును ఆపేసి ఇంటిదగ్గర కూర్చోబెట్టాయి.

సుబ్బారావు ఉండేది డాబామీది గదిలో. చదువుకునేదీ, పడుకునేదీ అందులోనే సుబ్బారావు తన గదిలో మంచం మీదపడుకుని "దిండుకింది పోచెక్క" నవల చదువుతున్నాడు. కమల కాఫీగ్లాసు పట్టుకు వచ్చింది. పుస్తక పఠనంలో మునిగి సుబ్బారావు తల త్రిప్పలేదు. "కాఫీ" అంది. సుబ్బారావు పుస్తకం పైకెత్తి కమలను చూశాడు. పావుకు తగ్గలావు, ఎరుపు రూబీ జాకెట్, అదే రంగు లంగా, తెల్లవాయిలు వోణి, ఉంగరాలు తిరిగిన ముంగురుల్లు, ఎన్నిజడలున్నాయో తెలియదుగానీ ఒకజడ మాత్రం బుసకొట్టే త్రాచులా ముందు వ్రేలాడుతూంది. పెద్ద పెద్ద నల్లని కళ్ళు, చిన్న నోరు, ముఖానికి తగ్గ ముక్కు, చామనచాయ రంగు .ఇలా అందాన్ని ఆస్వాదిస్తున్నాడు .

"ఏమిటలా క్రొత్త మనిషిలా చూస్తున్నావ్" సుబ్బారావు తబ్బిబ్బుపడలేదు. "నీ అందాన్ని" అన్నాడు తాపీగా, కాఫీగ్లాసందుకుని. సిగ్గుపడిపోయింది కమల "ఏం కమలా అలా సిగ్గుపడిపోతావ్ .. నేనేమి క్రొత్తవాణ్ణికాదుగా" అన్నాడు సుబ్బారావు.

కమల ఎన్నాళ్ళనుంచో సుబ్బారావు నొక మాట అడుగుదామనుకుంటోంది కానీ ఆ మాట చెప్దామనుకునేసరికి సిగ్గడ్డమొస్తోంది. సుబ్బారావే ఎప్పటికైనా తను అడగాల్సింది అడుగుతాడని వేచి ఉంది ఇంతకాలం. సుబ్బారావెలా అడుగుతాడు ! అతని ఉద్దేశం వేరుగా ఉంటే ఇవాళ ఎలాగయినా సుబ్బారావుని తను అడగాల్సింది అడగాలని అలంకరణలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకుని వచ్చింది. వెంకాయమ్మగారు సుబ్బారావుకి కాఫీ యిచ్చి రమ్మంగానే ఇదే మంచి సమయమనుకుని సుబ్బారావు గదిలో కొచ్చింది.

---

# వారఫలం

—మహేష్—

## 23–8–1974 శుక్రవారం మొదలు
## 29–8–1974 గురువారం వరకు

**మేషం** :— వృత్తిలో శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు రాగలవు. వారం ఆఖరులో సంతోషకరమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బుసమయానికి అందు తుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**వృషభం** :—ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరగలదు. రావలసిన డబ్బు అందగలదు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం చేస్తారు.

**మిథునం** :—వ్యాపారంలో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం**:— వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషిరాణిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీ వారితో మాటపట్టింపులు తగవు. ఇతరులనిమిత్తం మీరు శ్రమకు గురి కావలసి వస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు. స్త్రీలకు—వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. ఆడంబరంకోసం వ్యయం జరుగు తుంది.

**సింహం** :— ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది. వారం ఆఖరులో సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కన్య** :— మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సామాన్యమైన పనులకు కూడా మీరు ఎంతో కృషి చేయవలసి

"సుబ్బారావ్ నా అందాన్ని చూస్తున్నా నన్నావు కదూ... నా అందాన్ని గురించి నీ అభిప్రాయ మేమిటి?" డొంకతిరుగుడుగా అడిగింది.

సుబ్బారావేమో అందాన్ని గురించి అడుగుతోంది కదా అని "నీవు చాలా బావుంటావు కమలా...ఎలా అంటే...అమావాశ్య చీకటిలో... అపారమైన వెలుగు నిచ్చే అందాల చందమామలా."

కిలకిలా నవ్వింది కమల. ఇంకా నవ్వుతోంది. సుబ్బారావుకేమీ అర్థంకాలేదు. "ఏమిటి కమలా.. అంతలా నవ్వుతావు" కంగారుగా అడిగాడు సుబ్బారావు. కమల సమాధానం చెప్పకుండా ఇంకా నవ్వు తోంది. "సహజంగా ఆడవాళ్ల అందాన్ని పొగుడు తుంటే ఉబ్బి తబ్బిబ్బయి పోతారని విన్నాడు కాని ఇదేమిటి కమల నవ్వుతోంది. ..నవ్వులో తన భావాన్ని పైకి వ్యక్తం కానివ్వటంలేదా? ఏమో! ఆడవాళ్ళ నెరజాణలంటారు. ఇందుకేనేమో!" ఇలాంటిఆలోచన లతో సతమతమై పోయాడు సుబ్బారావు.

"అమావాశ్య చీకటిలో చందమామేమిటి సుబ్బారావు?" అంది నవ్వుతూ. సుబ్బారావుకి తెల్సింది తను అన్నదాన్లోని తప్పేమిటో! సుబ్బారావు గాభరా పడలేదు. మాటలతో గారడీ చేయగల నేర్పుంది. అతనికి. వెంటనే అందుకున్నాడు "ఇందుకా నువ్వు నవ్వేది... అమావాశ్య చీకటిలో చందమామ ఉంటే ఏమవుతుంది? అది పున్నమిరేయి. పున్నమి రేయెంత బావుంటుందో అలా వున్నావన్నాను." అన్నాడు అతని భావ కవిత్వంలో ఎంతో గొప్పగా విడమరచి చెప్పినట్లు.

కమల ముఖం రంగు మారింది. తాపీగా అంది అదోరకమైన బాధతో "సుబ్బారావ్ నా అందం గురించి కాదు, నా గురించేమిటి నీ ఉద్దేశ్యం ?

"మంచి పిల్లవు" అన్నాడు సుబ్బారావు మెచ్చుకోలుగా.

"ఆ మంచి తనమేదో... నీ స్వంత మవ్వాలనిపించటం లేదా ?"

"అంటే ?" అన్నాడు అమాయకంగా.

"పెద్ద చదువులు చదివావు ఇంకా అర్థం అవలేదా ?" చదువులకీ, ఇలాంటి విషయాలకీ ఏదో సంబంధం ఉంటుందని అడిగేసింది కమల.

"స్వంతమంటే నీ ఉద్దేశ్యంలో పెళ్లనా" సూటిగా అడిగాడు. అవునని తలూపింది కమల సిగ్గుగా. సుబ్బారావు నోటమాట రాక చూస్తుండిపోయాడు. తను ఆరోజు సోడాకొట్టు దగ్గర తన ఫ్రెండ్సుందరితోనూ తనిచ్చిన ప్రసంగం జ్ఞాపకం వచ్చింది.

"అసలు ప్రేమ పవిత్రమైనది. కొడుకుకూ తల్లికీ ఉండే ప్రేమే అసలైన ప్రేమ. ప్రేమించుకున్నాం, పెళ్లిచేసుకుంటాం అంటే అర్థంలేని మాట. ప్రేమించుకున్న వాళ్ళ పెళ్లిచేసుకోకూడదు. పెళ్లిచేసుకుంటేఅసలు వాళ్లకు ప్రేమ లేనట్టే. కేవలం శారీరక సుఖంకోసం మాత్రమే తొందరపడినట్లు. అబలలని ఆడవాళ్లను అడుక్కి త్రొక్కేశారుగా మన మగ వాళ్ళు. ఆడవాళ్ళుకూడా మగవాళ్లలాగా సంఘంలో జీవించాలంటే ఇంకాచాలా కాలం పడుతుంది. ఇప్పట్లో ఏమీ మారదు. అలా మారనంతకాలం పురుషుడు స్త్రీని లోకువగానే చూస్తాడు. పెళ్లిచేసుకుంటే మరీ లోకువగా చూస్తాడు. తనది కాకపోతే ఆ అమ్మాయి ప్రేమ సంపాదించాలని ఆ అమ్మాయికి వంతపాడతాడు. అందుకనే ప్రేమించుకున్నవాళ్ళు పెళ్లి చేసుకోకూడదు."

"మరయితే శారీరక సుఖం ఎలా వస్తుంది" అడిగాడో ఫ్రెండు "అదే నే చెప్పబోయేది. నేను చెప్పింది ప్రేమ పవిత్రమని. మన పెద్దాళ్ళఎలాగూ పూరుకోరుకదా పెళ్లి చెయ్యకుండా. వాడప్పుడే పెళ్లి వద్దు మొర్రో అన్నా విన్పించుకోరు. ఎందుచేతంటే ఏ ముసలమ్మో ఉంటుంది దానికి మనవడి పెళ్లి చూడాలని కుతూహలం లేకపోతే కుర్రాడి కట్నం పుచ్చుకుని అప్పులు తీర్చేయాలనో, ఆ డబ్బుపెట్టి పిల్ల పెళ్లి చేద్దామనో ఆలోచిస్తారుగానీ కుర్రాడి అభిప్రాయాలు తెల్సుకోరు. ఏదైనా కుర్రాడెదిరిస్తే నీకు తెలియదు. కుర్రతనమంటారు. లేదా ఆస్తిలో చిల్లిగవ్వయినా ఇవ్వను పొమ్మంటారు. పెద్దల్నికాదని ప్రేమించి పెళ్లిచేసుకుంటే ఆ సంసారం ఎన్నాళ్ళు నిలబడుతుంది ? నిలబడినా పరిస్థితులే ప్రేమికులలో కలతల్ని రేపుతాయి. ప్రేమించిన అమ్మాయిని పెళ్లిచేసుకుంటే ఆ పవిత్రత పోతుంది. ఇటు పెద్దల అండ కరువవుతుంది కనుక పెద్దాళ్ళ నిర్ణయించిన పెళ్లికి ఒప్పుకోవాలి... శారీరక సుఖం పొందాలంటే ఎవరైనా ఒకటేకదా... శారీరక సుఖంతో పవిత్ర ప్రేమను పాడుచేయకూడదు." గంభీరంగా అన్నాడు సుబ్బారావు.

"మరయితే ప్రేమించిన అమ్మాయిగతేమిటి?" సందేహం వెలిబుచ్చాడు మరో ఫ్రెండు.

"ఈ అబ్బాయి పెళ్లి చేసుకున్నట్లే ఆఅమ్మాయి కూడా తలిదండ్రులు ఖాయపరచిన సంబంధం చేసుకోవాలి" అన్నాడు సుబ్బారావు.

"ప్రేమించుకున్నట్లు తెలిస్తే ఆ అమ్మాయి నెవరు చేసుకుంటారు పెళ్లి" క్రాస్ ఎగ్జామిన్ చేశాడో ప్రబుద్ధుడు.

"అదేపోవాలి. ఒకమ్మాయి, ఒకబ్బాయి కలిసి ఉంటున్నారంటే శారీరక సంబంధం ఉందని ఎందుకనుకోవాలి ? లేదని ఎందుకనుకోవాలంటారేమో... మన సమాజం బాగా మారాలి. మన సమాజం అంటే మనమే. ఇలాంటివి మూఢంగా నమ్మకూడదు..అలా నమ్మి, మారనంతకాలం మనం ఇలాగే ఉంటాము."

ఇలా జరిగిన సంఘటన నెమరు వేస్తుంటే "సుబ్బారావ్ సుబ్బారావ్" అంది కమల కంగారుగా.

కంగారుపడ్డాడు సుబ్బారావు. కల కరిగింది. వాస్తవంలోకివచ్చాడు "కమల కెలా చెప్పటం తన ఉద్దేశ్యాలని... తనని అపార్థం చేసుకుంటుందేమో? ఎలా అయినా తప్పదు. తన ఉద్దేశ్యం చెప్పేయ

---

**ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు కార్రీగ్రాంట్‌కి ఒక కూతురు, నలుగురు పెళ్లాలు వున్నారట.**

**నాకు ఒక పెళ్లాం నలుగురు కూతుళ్ళు వుండి వుంటే ఎంతో సంతోషించేవాడ్ని అన్నాట్ట. పాపం! వాళ్ల బాధ పడలేకపోతున్నాడేమో! అన్నట్టు ఆయన వయస్సు 70 సంవత్సరాలు !**

---

...వస్తుంది. స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. పోటీవారిలో గౌరవం బాగుంటుంది.

**తుల :—** సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వ్యాపారవిస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది. మీ ప్రయత్నాలు లాభిస్తాయి. ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలుబాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**ధనుస్సు :—** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం అఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగు తుంది. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కల్సుకుంటారు.

**మకరం :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం అఖరులో మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కుంభం :—** అధికారుల వలన జరగ వలసి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవ లభిస్తుంది. దైవకార్యాలు నెరవేరతాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. విలాసవస్తువులుకొంటారు.

**మీనం :—** రావలసిన డబ్బు అందుతుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగుంటాయి. ప్రయోజనకర పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

## ఏది నిజం ?

టమే మంచిది..." ఇలా ఆలోచించి "కమలా.. నీ ఉద్దేశ్యంలో ప్రేమకూ...పెళ్ళికీగల సంబంధం యేమిటి ?"

"ప్రేమించుకున్న వాళ్ళు పెళ్ళిచేసుకుంటేజీవితం హాయిగా గడిచిపోతుంది" అంది కమల హుషారుగా.

"కాదు కమలా... నువు పొరపడుతున్నావు. ప్రేమ పవిత్రమైనది! ప్రేమించుకున్నవాళ్ళు పెళ్ళిచేసుకుంటే దానిలో పవిత్రతేముంటుంది! మన మిద్దరమూ పెళ్ళిచేసుకున్నా మనుకో...మనం ఒకరి గురించి ఒకరు ఆలోచించాల్సిన అవసరం ఉండదు. పైగా ఒకరిపై ఒకరికి నిర్లక్ష్యభావం పెరుగుతుంది కొన్నాళ్ళకు. నువు మరొకరి భార్య వయ్యావనుకో... అప్పుడు నీమీదనున్న గౌరవభావం తొలగిపోదు... మన ప్రేమకు పవిత్రతఏర్పడుతుంది" అన్నాడు పెద్దగా నూపిరి పీలుస్తూ.

"సుబ్బారావ్" అంది కమల గట్టిగా. "ఏమిటి సుబ్బారావ్ ఏమిటి... నీవింతవాదం...'దేవదాసు', 'లైలా—మజ్నూలు' ఎన్నికష్టాలు పడ్డారు పెళ్ళి చేసుకోవటానికి. ప్రేమించుకున్నవాళ్ళు పెళ్ళి చేసుకోవడానికి పడరానిపాట్లు పడుతుంటే నువ్విలా అంటావేమిటి ? నేనంటే నీ కిష్టంలేదా?" అంది గాభరాగా.

"నువ్వంటే నా కిష్టంలేకపోవటమేమిటి కమలా.. నేను ముందు చూపుతో మాట్లాడుతున్నాను. 'దేవదాసు' 'లైలా—మజ్నూ'లు పెళ్ళిచేసుకోవటానికి అష్టకష్టాలు పడ్డారు. నిజమే. అదేవాళ్ళు పెళ్ళిచేసుకుంటే వాళ్ళప్రేమలోని ఆ పవిత్రత నిలబడి ఉండేదికాదు కమలా...మన పురాణాల్లోని రాధాకృష్ణుల విషయం ఆలోచించు. రాధ..కృష్ణుణ్ణి ప్రేమించింది...ఆరాధించింది.. కానీ కామించలేదు... వివాహాన్ని కోరలేదు. అయినా వారు రాధాకృష్ణులుగా, పవిత్రప్రేమమూర్తులుగా నిలిచిపోయారు. మనకన్నా అప్పుడే అద్వాన్నయ్యారన్నమాట...ఆ... ప్రేమ వివాహాలు ఎక్కువగా విఫలం కావటానికి గల కారణమేమిటంటావ్" అన్నాడు సుబ్బారావు తాపీగా.

"ఏమో...నాకేం తెలుసు" అంది కమల విసురుగా.

"అయితే...నేను చెప్పనా..." అనునయంగా అడిగాడు.

"ఎవరి సంగతో ఎందుకు? మన సంగతి ఆలోచించు ముందు"

"ముందు పరాయివాళ్ళ విషయంలోని మంచి, చెడ్డలు తెల్సుకుని మనం వాళ్ళ అడుగుజాడల్లో నడవడం మంచిది. ప్రేమించుకున్న వాళ్ళు పెళ్ళి చేసుకుంటే ముఖ్యంగా మగవాడు ఆడదాన్ని లోకువగా చూస్తాడు. ఎందుచేతంటావ్?" అన్నాడు సుబ్బారావు. కమల మాట్లాడ లేదు. "తన స్వంతమై పోయిందని" జవాబు చెప్పాడు.

"సుబ్బారావు. . ఏమిటీ నీ ఉద్దేశ్యం? ప్రపంచంలో ఎక్కడా లేని సిద్ధాంతం లేవదీస్తున్నావు.

అన్యాయం చేయకు. నీకు పాపం చుట్టుకుంటుంది' విసురుగా అంది, ఆస్తికత్వం నిరూపిస్తూ. నాస్తికుడేం జరుగుతాడు పాపపుణ్యాలకు.

"పాప పుణ్యాలు. . మనం పెట్టుకున్నవే. .కమలా పూర్వం నీకు 'పుణ్యం' రాలని తమకు కావలసిన పనులు చేయించుకునే వారు. ఇప్పుడు 'లంచం' తో చేయించుకుంటున్నారు. అంటే అప్పటి పుణ్యం ఇప్పటి లంచం అయింది. నేనేమీ క్రొత్త సిద్ధాంతం లేవదీయటం లేదు. ప్రేమ పెళ్ళిళ్ళ మీద నా అభిప్రాయాన్ని అర్థం చేసుకోమంటున్నాను.

'ఎలా అర్థం చేసుకోమంటావ్. . ఎక్కడా లేనిది?'

"నేనొక టడుగుతాను... చెప్పు కమలా... తడి యిసుక బరువా? పొడి యిసుక బరువా? " మతి చలించిన వాడిలా అడిగాడు ప్రసంగాన్ని మారుస్తూ.

సుబ్బారావుకేమీ మతి చలించలేదు కదా? 'తడి యిసుక బరువా? పొడి యిసుక బరువా?' అని అడుగుతున్నాడు, 'చిన్న పిల్ల చెప్తుంది దీనికి సమాధానం. ఇప్పుడసలు యిసుక సంగతెందుకు' అందుకే చిరాగ్గా "తడి యిసుకే బరువు" ఎంతో తేలిగ్గా చెప్పింది కమల.

"కాదు పొడి యిసుకే బరువు. సాధారణంగా తడి యిసుకే బరువనుకుంటారు . చూశావా. అలాగే ప్రేమ పెళ్ళిళ్ళు ఆదర్శవంతమై హాయిగా వుంటాయనుకుంటారు గానీ అవి ఎన్నాళ్ళు నిలుస్తాయో ఆలోచించటం లేదు. నా మాట విని మీ నాన్న తెచ్చిన సంబంధం చేసుకుని హాయిగా జీవించు."

"సుబ్బారావ్. . దేముడి మీద నమ్మకముందా నీకు?" నాస్తికుడెంతకైనా తెగిస్తాడని ,సుబ్బారావెలా అడిగాడో యిసుక సంగతి తనూ అలాగే అడిగింది.

అంత సీరియస్‌లోనూ బిగ్గరగా నవ్వేశాడు సుబ్బారావు. "నేను నాస్తికుణ్ణి కమలా. ప్రపంచంలో ఏది జరిగినా విధి నిర్ణయం, దైవలీలలనటం అలవాటయిపోయింది. . కమలా"

సుబ్బారావు ప్రసంగం తలపోటు ఎద్వరు పైబా మెంటులా పనిచేసింది కమల మీద.. "ఎందుకిదంతా.. నన్ను పెళ్లి చేసుకుంటావా? లేదా ?"అని చిరాగ్గా అడిగింది కమల తలపోటొచ్చేసి.

"ఎలా...? నేను ఉత్తర ధ్రువం, నీవు దక్షిణధ్రువం రెండూ ఎలా కలుస్తాయి? కొన్ని కోట్ల సంవత్సరాలకు మాత్రం ధ్రువాలు తారుమారవుతాయట. అప్పుడయినా నీ అభిప్రాయాలు నాకూ, నా అభిప్రాయాలు నీకూ వస్తాయి. కొన్ని కోట్ల సంవత్సరాలయినా మన పెళ్లి కష్టమే. నన్ను ద్వేషించకు కమలా. . ఇది వరకటిలాగే కలిసుందాము" లాగి లెంపకాయ వేసి సారీ అన్నట్లుగా దీనంగా అన్నాడు సుబ్బారావు.

పైట కొంగు కళ్లకద్దుకుంటూ పరుగెత్తు కెళ్ళిపోయింది కమల.

"తనలో యేం చూచి కమల తన్ను ప్రేమించింది. అందుకనేమో. . ప్రేమ గుడ్డిదంటారు. అయినా ఏం చేయను. అసలు మాది ప్రేమకాదేమో.




కలిసి మెలిసి తిరుగుతున్నాం కాబట్టి అనురాగం ఏర్పడిందేమో. . అవును అదే కారణం కావచ్చు" ఇలా తర్కవితర్కాలు చేసుకుంటూ నిద్రలోకి జారిపోయాడు సుబ్బారావు.

"సుబ్బారావ్. . సుబ్బారావ్. ." అని తల్లి కేకటంతో లేచాడు సుబ్బారావు. వెంకాయమ్మగారు కంగారుగా. . "కమల. కమల" అంటోంది.

"ఏమిటమ్మా? కమల. ." ఆత్రంగా అడిగాడు సుబ్బారావు.

"కమల నూతిలో దూకేసిందట! ఇంటి నించి ఎప్పుడు వెళ్లి పోయిందిరా? నువ్వేమైనా. ..." అడిగింది సుబ్బారావు తల్లి.

"అబ్బే. . నేనేమీ అన్లేదే!"అంటూ తొందరగా ఎదురింటికెళ్ళాడు.

కమలను నూతినుంచి అప్పుడే తీశారు. నూతి ఒరలు తగిలినందువల్ల అక్కడక్కడా గాయాలయ్యాయి. నీళ్ళు బాగా త్రాగేసినట్లుంది. మనిషి బాగా లావై చూడ్డానికి వికారంగా ఉంది. సుబ్బారావు కేం చేయాలో తోచలేదు. సుబ్బారావు తొందరగా పరుగెత్తికెళ్ళి డాక్టరును తీసుకొచ్చాడు. నీళ్లను కక్కించి. . . తగిలిన గాయాలకు కట్టుకట్టి ఏమీ ఫరవాలేదని చెప్పి డాక్టరు వెళ్లిపోయాడు సాయంత్రం మళ్లీ వస్తానంటూ. కమలపడిపోయిందే అన్న కంగారే గాని ఏం చేయాలో తెలియని కమల తల్లిదండ్రులు సుబ్బారావును కన్నీళ్ళతో అభినందించారు డాక్టరును తీసుకు వచ్చినందుకు. వాళ్లకేంతెల్సు. . సుబ్బారావు వింత అభిప్రాయాలమూలంగానే కమలిలాతెగించిందని.

రెండు రోజులు గడిచాయి. కమలకు బాగా నయమయ్యింది. ఇంకా గాయాలు మానలేదు. "ఎందుకు చేశావమ్మా. . .అలా"అని తల్లడిగితే "ఏమోనమ్మా... నూతిదగ్గరికెళ్ళా. . ఎవరో గెంటినట్లయి నూతిలో పడిపోయానంతే" అని చిన్న అబద్ధం ఆడేసింది.

అదేం లక్షణమో. . ప్రేమించుకున్న వాళ్ళు ఒకళ్ల గురించి ఒకరు త్యాగాలు చేసుకోవటం మామూలై పోయింది. ప్రేమికులలో, ఎవరైనా... ఏదైనా తప్పు చేస్తే దాన్ని కప్పిపుచ్చటానికి ఇ రెండోవారు సదా యాతనను భరించలేం. అవేదో గాలి లక్షణమని దక్షరం తప్పించి జరిపించింది కమలకు కమల తల్లి.

కమల ఆత్మహత్యాయత్నంతో సుబ్బారావు మనస్సు గాయపడింది. "తన మీదెన్నో ఆశలు పెట్టుకున్న కమల తనెందుకు ప్రాణం పెనుకోవటానికి అంగీకరించటం లేదు. . కమలను తను ఆరాధించాడే కానీ శారీరకంగా వాంఛించలేదు"ఇలా ఆలోచిస్తూ గడుపుతున్నాడు రోజుల్ని.

ఇంటిలో రామం గారికి ప్రమోషనయింది. నాలుగయిదు రోజుల్లో వెళ్లి పోతారాయన ఉద్యోగంలో జాయినవ్వటానికి. మాటల సందర్భంలో వెంకాయమ్మగారు, ఈశ్వరమ్మగారితో ఈ విషయం చెప్పారు. పాపం. ఈశ్వరమ్మగారు కూడా చాలా బాధపడ్డారు. బాధ సహజమేగా మరి. బంధువుల కన్నా ఎక్కువగా కలిసుండేవి ఆ రెండు కుటుంబాలు.

"మనిషి పోయేటప్పుడు మమతను వీడడు.. ఆ మనిషికి ఆ మమతమీ గల అనుబంధమేమిటో?"

రామంగారు వెళ్ళిపోతారనగా కమల తండ్రి పరంధామయ్యగారు రామంగారింటికి వచ్చి "రామంగారూ.. రామంగారూ. . అని" కేకవేశాడాయన గుమ్మంలోంచి. "ఎవరూ" అంటూ వచ్చి "రండి" అని ఆహ్వానించాడు సుబ్బారావు. "నాన్నగారు లోపలున్నారు, పిలుస్తానుండండి.. ఈ కుర్చీలో కూర్చోండి" అని కుర్చీ చూపించి లోపలికి వెళ్లాడు.

రామంగారు వచ్చారు. "ఏమిటి విశేషం." అన్నారు. కుర్చీలో కూర్చుంటూ. సుబ్బారావు లైబ్రరీ పుస్తకం చేతో పట్టుకుని బయటికెళ్ళి పోయాడు. బహుశా లైబ్రరీకనుకుంటా. "ఏముందండి. . మనకున్న వాళ్లు ఒక్కొక్కళ్లు. ఆ ఇద్దర్నీ కలిపేస్తే. . " అన్నారు పరంధామయ్యగారు.

"బావుంటుందంటారు. . అలాగే. నేను ఎలానూ ట్రాన్స్‌ఫరయ్యానుగా. . వాడికి పెళ్లి చేసి ఇక్కడే ఉంచుదామనుకుంటున్నాను. . మా వాణ్ని కూడా

(14 వ పేజీ చూడండి)

*(గత సంచిక తరువాయి)*

**కొ**ని వారం రోజుల్లోనే ఆవిడకి అమ్మాయి ప్రవర్తనా, జమిందారీ ఫాయి పద్ధతులు వింతగా తోచాయి "ఈ పిల్లకి నూలుచీరెలు లేవా" అనుకుంది. అంతంతలేసి పట్టుచీరెలు రోజూ తడిపేస్తుంది. వజ్రాల నెక్‌లెస్, కెంపుల పట్టెడ, పచ్చలహారం అవే తెచ్చు కుందిట. మార్చి మార్చి అలంకరించు కుంటుంది. పుట్టింటివారు కోటికి పడ గెత్తినవారా అనిపించింది. "మీ తండ్రిగార్కి



యేం పనని" అడిగింది అత్తగారు. "రత్నాల వ్యాపారం" అని అబద్ధ మాడింది. అప్ప చెల్లెళ్ళ అన్నదమ్ముల గురించి భోగట్టా చేసింది. తనొక్కర్తినే పిల్లనంది. "అయితే ఆస్తంతా నీకే వొప్పజెప్పతారో మొగపిల్ల వాణ్ణి పెంచుకుంటారో, నీకడుపు చల్లగా నీకో కొడుకుపుట్తే వాళ్ళదగ్గరే వదిలేయ వచ్చు". "నా కాస్తి వద్దని చెప్పేసానండి. నా జవహారీకూడా చాలా అక్కడే వదిలేసాను"

"అయ్యో! అదేం పనే. మావాడు తొందర పడి వుంటాడు. వాళ్ళకిష్టం లేకుండా నిన్ను లేవదీసు కొచ్చి ఘట్నుంది చూడగా. నిదానిస్తే వాళ్ళే చక్కగా పెళ్ళిచేద్దురు. వాళ్ళెంత విచారిస్తున్నారో. ఒక్కగానొక్క పిల్లవు. అచ్చట ముచ్చట తీరలేదు మా వాడి కైతే రెండో పెళ్లి గాని నీ సరదాలు తీరొద్దు?" అని సానునయంగా మాట్లా డింది తన వియ్యపురాలి కష్టం అంటూ వొక్క చీరైనా తేలేమ. యింకా యేవేవో ప్రశ్నలు వేస్తూనే వుండేది. ఒక్కొక్కసారి కోడలి సమాధానం, కొడుకువి వేరుగా వుండేవి.

మూడు నెల్లు గడిచే సరికి ఆ నోటా ఆ నోటా అసలు సంగతి బయట పడింది. అత్తగారు గుండె బాదుకొని యేడ్చింది. కోడల్ని నిలవేసింది. యే మాటా చెప్పలేక "మీ కొడుకునే అడిగి తెలుసుకోరాదూ ? నన్ను బాధించకండి" అంది. "యేమి సంగ నాచివే ? నా కొడుకుని నువ్వుగాదూ నీ వల్లో వేసుకున్నది ? మా వంశం భ్రష్టు చేసావే" అని తిట్టిపోసింది. మరకతం గదిలో నుంచి వైటకి రాలేకపోయింది. అంతలో కొడుకు కూడా రాగా పట్టి దులిపేసింది. "నువ్వెక్కడ పెళ్లి మానుకుంటావోనని యే కులమైనా, శాకాహారిని, నీకు నచ్చినదాన్ని చేసుకోరా అని యేడ్చాను. అందుకని యిదిట్రా నీ నిర్వాకం? నీకు భోగం ముండట్రా దొరికింది ? నీకు ముండ కావలసొస్తే బైటే యేడవక నా నెత్తి నెక్కించావేం పాపంరా ?" అంటూ నెత్తి నోరూ కొట్టుకుంది. "ముండేమిటమ్మా నేను పెళ్లాడాకా? నీకు నేను బ్రతకాలని లేదేమిటి ?" అన్నాడు కల్యాణ సుందరం. దాంతో ఆవిడ నోరు మూతపడ్డది. కాని మరకతాన్ని వంటింటి గడప దగ్గరకు రాకంది.

*జరిగినకథ : 1* సంగీత నాట్యాలో ఆరితేరిన మరకతాన్ని చేపట్టారు కళాభిమాని అయిన చిదంబరం చెట్టియారు. తను తల్లి కావాలన్న తపనతో చెట్టియార్ని వదలి న్యాయమూర్తి కళ్యాణసుందరాన్ని వివాహమాడుతుంది మరకతం.

వంటబ్రాహ్మడు మామ్మకి, మనమడికి వడ్డించి వారి భోజనాలయేకే అయ్యగారికి అమ్మగారికి వడ్డిస్తున్నాడు.

ఈ గొడవ జరిగిన రెండురోజులకి అన్నని కొత్త వదిన్నీ చూద్దామని ఆడబడుచు దిగింది. ఇంటి బాగవతం అంతా తల్లి వల్ల విని వోదార్చింది. "ఒసే అమ్మా ! ఆస్తి కోసం యిలాంటి భోగంవాళ్ళు యేంటైనా చేయగలరు. బాబు జాగత్త. దాని చేతి మీదుగా వాడికి తినడానికి యేమీ పెట్టించకు" అని చెప్తున్న మాటలు మరకతానికి వినిపించి నిలువునా కంపించిపోయింది.

"అన్నయ్యా! పెళ్లాడావుగదా, మరి నాకు చీరేదీ?" అని అడిగి ఆడబడుచు మంచి చీరె కొనిపించుకుంది. వదినెగారి నగలు చూసింది. "ఈ చీరె మీదికి ఈ కెంపుల పట్టెడ బాగుంటుంది. వో మాటు పెట్టు కునేదా వదినా?" అంటూ జవాబుకి యెదురు చూడకుండానే పెట్టేసుకుంది. వెళ్లేనాడు మర్చిపోయిందేమో మరి తిరిగి ఆ నగ మరకతం దగ్గరకు రాలేదు

* * *

బలరాం యిదివరకులాగ మరకతం దగ్గరకు రావడంలేదు. వాడికి రావాలని ఆపేక్ష. కాని నాయనమ్మ కోంబడుతుందని భయం. అత్తా వొదినెగార్ల మాటలు విన్న తరువాత నుంచీ మరకతానికి వాణ్ణి దగ్గరకు పిలవాలన్నా భయంగా వుంటోంది. మరకతానికి కూడా ఈ అవమానాలు ఎనిమిది నెల్ల గర్భిణీతోనూ సిర్పించి వోపిక లేకుండా వుంది. వారం రోజులు 'ఫ్లూ' వచ్చి మంచానబడింది. జ్వరం లోనే నొప్పులు రావడం మొదలుపెట్టితే ఆసు పత్రికి తీసుకువెళ్లారు. మత్తు యిచ్చి పిల్ల వాణ్ణి పైకితీసారు. ప్రీమెచ్యూరుట. పిల్ల వాణ్ణి ప్రత్యేకమైన గదిలో వుంచి నర్సులు జాగ్రత్తగా చూసారు. నాల్గు రోజుల తరువాత గాని మరకతం పిల్లవాణ్ణి చూడలేదు. నెల్లాళ్ళు ఆసుపత్రిలోనే వుండవలసివచ్చింది. మరో వారం రోజుల్లో యింటికి వెళ్లవచ్చునని టానిక్కులు కొన్నాళ్లవరకూ బాగా తీసు కోవాలని డాక్టరు చెప్పింది. కళ్యాణసుందరం రోజూ ఆసుపత్రికి వచ్చి చూసి వెళ్తున్నాడు. కాని అతని మనసులో వొక అనుమానం పొడ జూపి పెనుభూతంలా బయపెట్టసాగింది. పిల్ల వాడు ప్రీమెచ్యూర్ కాదని తన కొడుకేకాదని అనుమానించాడు.

"నీ కొడుకు చక్కనివాడే" అన్నాడు.

"మీ కొడుకు కాదేమిటి?" అని చాటంత మొహంచేసుకొని అడిగింది. ఆ నీరసించిన మొహంలో చారెడేసి కళ్ళు యింకా పెద్దవిగా కనిపించి ఆనందాతిశయాలతో మెరిశాయి.

"నా కొడుకే అంటావా? ప్రీమెచ్యూర్ అని నువ్వు, డాక్టరు మధ్యపెట్టితే సరా? అయినా నేనిప్పుడు అనవలసిన మాట కాదిది. మనసు పాడు చేసుకోకు. నువ్వు పూర్తిగా కోలుకుంటే ఈ వారంలో యింటి కొచ్చేస్తావు."

మరకతం తడారిపోయిన కళ్ళతో వెర్రి దానిలా చూస్తూ వుండిపోయింది. అనకూడని మాటేదో అనేశాడు. మనసు పాడుచేసుకోకంటే సరా? తనేదో చాలా వుదారస్వభావుడిలా "కష్టపెట్టుకోకని" మరోసారి అని వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

మరకతం చాలా కుమిలిపోయింది. ఆ రాత్రంతా బాధపడుతూనే వుంది. "అత్త గారల్లాగ, ఈయనిప్పుడు యిల్లా మాట్లాడా రేమిటి? ఎవరేమనుకొన్నా ఈతని మనసు నిర్మలమైనదైతే తనకి విచారం లేదు. అయ్యో! భగవంతుడా! నా బ్రతుకు సరిగా వెళ్ళదేమిటి చెప్మా" అని ఆ రాత్రంతా యేడ్చింది. ఒంటిగంటకు నర్సు చూసి నిద్రకి మాత్ర యిచ్చి వెళ్ళింది.

*　　*　　*

మరకతం యింటి కొచ్చింది. తల్లిని పిల్ల వాణ్ణి చూసుకోడానికి వొక నర్సుని యేర్పాటు చేశాడు కళ్యాణసుందరం. అతని దర్శనం మాత్రం అరుదైపోయింది. యేమనడిగితే "నువ్వు నీరసంగా వున్నావని, నాకు పని ఎక్కువగా వుం"దని సాకులు చెప్పి తప్పించుకుంటు న్నాడు.



పిల్లవాడికి నాలుగునెల్లు వచ్చాయి. "నాకు వోపిక వచ్చిందమ్మా" అని చెప్పి నర్సుని మాన్పించేసింది. తనే పిల్లవాడికి అన్నీ చూసు కుంటోంది. ఒకనాడు కళ్యాణసుందరం ఎదటికి వెళ్ళి యేడ్చింది. "ఎందుకిల్లా మారి పోయారు? నేను అన్నీ వొదులుకొని వచ్చింది ఈ నిరాదరణకేనా? సంసారమంటే యింతే? పెళ్ళి పిల్లలు అంటూ అక్రోశించాను, నేను కలలు గన్న సంసార మిదేనా? బాబు మీ కొడుకు కాదని అనుమానించితే నేనేం చెప్పేది? నిస్సంకోచంగా మీ వాడే. పోని చెట్టియారు బాబే అనుకోండి నేను మీ బలరాంని ప్రేమించటం లేదూ? యిప్పటికైనా మీ బలహీనత గ్రహించి మమ్మల్ని ఆదరించండి. వెనుకటి వూహాలు రానీయకండి" అని యేడుస్తూ పిల్లవాణ్ణి ఆయన వొళ్ళో పడేసింది.

"తీసేయ్ తీసేయ్. యింత చిన్నపిల్ల వాణ్ణి నే నెత్తుకోలేను," అని కంగారు పడ్డారు. మరకతం పిల్లవాణ్ణి తీసుకొని తనూ వొక కుర్చీలో కూర్చుంది.

"మీ యిద్దరికీ నేనేం అన్యాయం చెయ్య బోవటంలేదు. నిన్ను పెళ్ళి చేసుకొని నేనే నష్టబోయాను. అమ్మకి కష్టం గలిగించాను. కోర్టులో నన్ను గురించి గుసగుసలు విన్నాను. పెళ్ళాం ఎనిమిదో నెల్లోనే పిల్లవాణ్ణి కందని చెప్పుకుంటున్నారు. నలుగురిలో తలెత్తి తిరగ లేకుండా వున్నాను. నా హోదా యేమిటి? నా కీ అపకీర్తేమిటి? ఇహ నీకూ నాకూ సంబంధం లేదు. నా కర్మ కాలి నిన్ను తెచ్చిపెట్టుకున్నందుకు నువ్వే హాయిగా వుండు. ఈ యిల్లు ఈ విశాలమైన గదులు నీవే, మహారాణిలా మసులుకో, పిల్ల వాణ్ణి పెద్దచెయ్యి, నెలనెలా వెయ్యిరూపాయి లిస్తాను, కర్చు పెట్టుకో. నేను పద్దడగను."

మరకతానికి చెళ్ళున చెంపకాయి తిన్నట్లని పించింది. "మీరు నాదిగాదూ? ఈ యిల్లు వాకిలీ నావా? నాకు మీరు కావాలి. మీ ప్రేమ కావాలి. ఈ బాబు మీవాడేనని వొప్పుకోండి. మన మధ్య ప్రేమకి మీ హోదా అడ్డు వచ్చే ట్లయితే ఆ పదవి వదులుకోండి. మరోచోటుకి పోదాం రండి. ఐనా, హోదాలో వున్నవారు

# రామనాథన్ క్రిష్ణన్ కి ప్రియమైన కాఫీ:

# నెస్‌కాఫీ!

"ఉత్తేజ కల్పనకు దక్షిణాది కాఫీ గింజలతో తయారయిన కాఫీకి దీటులేదు. (నా కాఫీ మోస్తరు... నెస్‌కాఫే."



అసలైన తెలుగు కాఫీకి అలవాటైనవారికి తెలిసినట్లు ఇతర ఇన్‌స్టంట్ కాఫీలన్నిటికన్న నెస్‌కాఫీ విశిష్టమని దానిని ప్రత్యేకం తనవంటి కాఫీ కాముకులకోసం తయారు చేశారని అత్యుత్తమమయి 100% పరిశుద్ధమయిన దక్షిణాది కాఫీ గింజలతో.




నెస్‌కాఫీ

నెస్‌కాఫీ ఎక్కువ ప్రియమైనవారికి అత్యంత ప్రియమైనది

ACIL-90(2) 233 TEL

పెద్దమనుష్యులు యిల్లాగే ఆలోచిస్తారా ? అల్పబుద్ధి న్యాయమని సమర్థించుకోవడమే పెద్దమనిషి తరహాయా ? రేపు హాస్పిటల్‌కి వెళ్దాంరండి. పిల్లవాణ్ణి డాక్టరు పరీక్ష చేయిద్దాము."

"యిప్పటికే నలుగురు నవ్వుతున్నది చాలక అది బుజువయితే ? ప్రేమా గీమా అంటూ నాతో మాట్లాడకు. నీ అభినయం భోగం టక్కులు కట్టి పెట్టు. ప్రేమ పేరిట అనామధేయునిగా యేమారు మూలకో పారిపోయి దాక్కోను. సుప్రీం కోర్టు జడ్జీ, ఛీఫ్ జస్టిస్ ఆఫ్ యిండియా కూడా అయి తీరుతాను. చెట్టేరాగి నిన్ను పెట్టుకొని ఆడించి డబ్బు గుంజేందుకు అనుకున్నావేమో నీలా అతివాదన చేసే వాళ్లంటే నా కసహ్యం న్యాయమాలోచించి ఏదో ఏదో విధంగా యేర్పాటు చేస్తున్నాను. ఎదురు చెప్పక అల్లా పడివుండు"

"నీ న్యాయం, అత్తగారి సంఘం నా ప్రేమను గూడా ఒనకలు వేసింది న్యాయశాస్త్రానికి మనసు లేదు మీ బుద్ధికి తోచిందేగాని మనసుని పరిశీలించుకోరు పైపై మెరుగేగాని మనసుకి పట్టిన కిలం తుడిచి ప్రకాశింపజేయరు పెళ్ళికి ముందు ఎవరూ నన్ను 'వేశ్య' అనలేదు నే నెవరైనా నాకళని ఆరాధించి మెచ్చుకున్నారు పెళ్ళయినాకే నాను మీరందరూ భోగంది అనే బిరుదు అంటగట్టారు. మీ కళ్ళు మనలో మెరుగైన వేదో చూడలేవు పోనీ ఆ బిరుదూ బాగానే వుంది నేను చాలా తక్కువజాతి దాన్ననే సత్ప్రవర్తన నన్ను వేరేపదిమందికి సంతోష మివ్వగలిగినే అతిశయము ఇమిడి వున్నాయి. మీరు ఆగ్రకులస్తులు వుస్తుతంగా ఆలోచించండి. మీరుకట్టుకున్న భార్య ఇవ్వవలసిన సంతోషమిదిగాదా ? నన్ను దుఖపెట్టడం న్యాయ విరుద్ధంగా తప్పుగా తోచడంలేదా ? ఎనిమిదో నెల్లో పిల్లలు కలగడం ఎంత మందికి జరగదు ?"

"అల్లా జరగవచ్చు. కాని యేమీ లేనిదే అన్నారా చెట్టియారుకి బాబుని చూపిద్దామని ? మళ్లీ రమ్మంటాడేమో అడుగు ఆగింగా స్నానాలు చేస్తు వుగాని."

"మన మధ్య ఆయన మాట లెన్నిసార్లు దొర్లలేదు ? మీరే ఎత్తి నా కిష్టంలేని జవాబులు బలవంతాన నవ్వించి లాగారు. యింకెప్పుడూ ఆయన మాట ఎత్తవద్దు లెండి. నాచేత చెప్పించి మనసులో కుళ్ళు తున్నారన్నమాట."

"ఆమధ్య త్యాగరాజన్‌కి వుత్తర మిచ్చావే? యేం రాసావందులో ?"

"చెట్టియారు నా డబ్బంతా యిక్కడి బ్యాంకికి ట్రాన్స్‌ఫర్ చేసారని చెప్పానుగదా ? నా నగలు కూడా త్యాగన్నచేత పంపించేసారని చెప్పాను అవి అందినట్లు చీటీరాసి యియ్యి చెల్లెమ్మా' అన్నాడు. అవి అందినట్లు రాసిస్తూ బాబు పుట్టినట్లుకూడా రాసాను. అంతకంటే రహస్యం ఆ వుత్తరంలో లేదు.

"అన్న! అన్న! భోగం ముండలందరికీ అన్నలే మొగుళ్ళన్నమా. ఆ త్యాగరాజన్‌ను చూసి నీకసలు హొళ్లు తెలిసిందా ? యేమి సంతోషం ! హోటల్‌లో దిగివెళ్తున్న వాడికి



నగ, గట్రా పోయింటే మేము ఇంత బాధపడే... ఛం కాదుసార్ ! వాళ్ళు పంచదార డబ్బాలు, రేషన్‌కార్డు పట్టు కెళ్ళారు !!

బలవంతంచేసి భోజనం పెట్టావు. పాటలు పాడి వినిపించావు నా యింట్లో నీ గొంతు మళ్లీ యెప్పుడూ వినబడనీయకు. యిదే చెప్తున్నాను"

"ఈ యేడాదయినా నా సాధకమే పోయింది. త్యాగరాజ పంచరత్నాలు నేపాడగా వినాలనుందంటే రెండు పాడాను. మీ ఆలోచనలన్నీ వక్రంగా వున్నప్పుడు నేను చేసింది తప్పుగానే కనిపిస్తుంది. డబ్బు వుచ్చుకోడానికి బాగానే వుంది. మన గడప తొక్కి అరగంట మన మర్యాద స్వీకరించాడని బాధపడి పోతున్నారు. పసిపిల్ల వాని విషయంలో యేదో అపోహ పడుతున్నారనుకున్నాను. ప్రతి విషయానికీ అనుమానపడి సమాధానం అడిగితే నే చెప్పక్కర్లేదు. మీరు పశ్చాత్తాప పడితేనే నేను మళ్లీ మాట్లాడేది. నాకు దెబ్బలాటలంటే అసహ్యం." అని బాబుని తీసుకొని మరకతం తన గదిలోకి వెళ్లిపోయింది.

ఆ రాత్రి మరకతం పిల్లవాణ్ణి దగ్గరగా లాక్కుని పడుకుంది. "వీణ్ణి జాగ్రత్తగా పెంచుకోవాలి. వీడు బ్రతికి బట్ట కడితే చాలు ఆహా ! తీరింది నాకు పిల్లల సరదా" అనుకొని కళ్ళంట నీళ్ళ ప్రవహిస్తుండగా నిద్రలోకి జారిపోయింది.

*  *  *

మర్నాడు మరకతానికి జ్వరం తగిలింది. వంటవాడు మరకతం భోజనానికి రాలేదని అత్తగార్కి చెప్పాడు ఆవిడ వెళ్ళి గది గుమ్మంలోంచే అడిగింది. "యేమే భోజనానికి లేవలేదూ ? వళ్లు బాగాలేదా ?"

మరకతం జవాబుగా భోరుమని యేడ్చింది. "యేమండీ ! అత్తయ్యగారూ ! మీకు యింత వయస్సు వచ్చింది గదా, మీకు ఎనిమిదోనెల్లో బిడ్డ పుట్టిన కాన్పుల విషయం ఎరగరా ?"

"యెరెక్కే మే పిల్లా. ఎక్కడి మాటో గాదు. నా తోటి కోడలే కన్నది యేడోనెల్లో పిల్లవాణ్ణి. మా వాడు వట్టి అనుమానం మనిషి లేద్దూ. మొదటి భార్యని కూడా యిల్లాగే యేడ్పించాడు. నా అన్న కూతురే అది. ముప్ఫయిఅయిదేళ్ళయినా కాన్పు రాకపోతే నాతో కూడా యీ తలకు లీసుకు వెళ్లాను. పూజలు చేయించాను. తిరిగి వచ్చాక బలరాం కడుపున బడ్డాడు. మా వాడు సంతోషించడం పోయి "యిది యే స్వామి కటాక్షం" అంటూ దాన్ని కాల్చుకుతిన్నాడు, దానికి ఆయుఃషే లేకపోయింది. ఎన్ని తిప్పలు పడవలసి వచ్చేదో వీడితో. ఐనాగాని వాడేదో అన్నాడని నువ్వు నీ గదిలో తలుపులు మూసుకు కూర్చుంటే ఎల్లాగే ? నీకు నేను నేర్పాలా ? నీకు వచ్చిన విద్యేగా చక్కగా ముస్తాబై వాడి ఎదుట పడుతూ వుండాలి గాని యిదేమి సోద్యమే ?"

అత్తగారి మాటలు హోదాల్పో వెక్కిరింతో బోధపడింది కాదు. "అత్తయ్యగారు వారు స్వామి ప్రసాదం అన్నా యేమన్నా మీరు బలరాంని సాకినట్లు నేను పోతే నా బాబుని సాకుతారా ?" అంటూ యేడ్చింది.

(ఇంకా ఉంది)

# విటమిన్లు మరియు ఖనిజములు మీ కుటుంబము యొక్క ఆరోగ్యమునకు ఎంతో అవసరము




## వారికి తగినన్ని లభిస్తున్నాయా?

విటమిన్లు మరియు ఖనిజముల లోపముతో మీ కుటుంబపు ఆరోగ్యము పాడవవచ్చును. అలసట, జలుబు, ఆకలి లేకపోవడము, నిరుత్సాహము, చర్మము మరియు పళ్ల బాధలు మొదలైనవన్నీ అవసరమైన విటమిన్లు మరియు ఖనిజముల లోపమువల్ల మామూలుగా కలుగుతాయి.

విటమిన్లు మరియు ఖనిజముల లోపము సమృద్ధియైన ఆహారములో కూడ ఉండవచ్చును. కనుక మీ కుటుంబములో ప్రతి ఒక్కరికీ నిశ్చయముగా యీ అవసరమైన పోషక పదార్థములు కావలసిన పరిమాణములో లభించుటకు, వారికి రోజూ ఒక విమ్‌గ్రాన్ బిళ్ల యివ్వండి

విమ్‌గ్రాన్‌లో ముఖ్యమైన 11 విటమిన్లు మరియు 8 ఖనిజ పదార్థములు ఉన్నాయి. ఇనుము—రక్త వృద్ధికి, చురుకుదనమును యిచ్చుటకు, కేల్షియమ్—ఎముకలను మరియు పళ్లను బలిష్టముగా చేయుటకు, విటమిన్ సి—జలుబు రాకుండా అడ్డుటకు, విటమిన్ ఎ—తేటయైన కళ్లు మరియు ఆరోగ్యమైన చర్మమునకు, విటమిన్ బి$_{12}$—ఆకలిని అధికము చేయుటకు మరియు శరీర ఆరోగ్యమునకు. ఇంకా యితర ముఖ్యమైన పోషక పదార్థములు ఉన్నాయి.

# విమ్‌గ్రాన్®

వివిధ విటమిన్లు మరియు ఖనిజములుగల బిళ్లలు
11 విటమిన్లు + 8 ఖనిజ పదార్థములు



® SQUIBB®
SARABHAI CHEMICALS PVT. LTD.

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం. దీని లైసెన్స్‌డు ఉపయోగదారులు ఎస్‌సిపిఎల్.

## ఒక విమ్‌గ్రాన్ మిమ్మల్ని రోజంతా శక్తివంతముగా ఉంచుతుంది

Shilpi-HPMA 2A/74 Tel

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**ఆర్ ఎస్. ఎల్ నెల్లూరు.**

అమాయకురాలైన ఆడపిల్లల పేర్లు గోడలకి ఎక్కిస్తూ, వాళ్ళమీద లేనిపోని ఇంటింటికీ మోసే పెద్ద మనుషులను ఏమనాలి ?

అంత అల్పబుద్ధులు పెద్దమనుషులకి ఉండవు చిట్టి తల్లీ. ఇక అలాంటి వాళ్ళు చెప్పేది విని నమ్మేవాళ్ళు— అస్సలు పెద్దమనుషులు కారు !

**ఎస్. ఎమ్ ఎస్. ఆర్. మంగళగిరి.**

అక్కయ్యగారి కలానికెలా బుద్ధి చెప్పాలో తెలియటంలేదే ?

బాబ్బాబు— కాస్త శ్రమపడి కసుక్కో— చాలామందికి కావాలిట !

**పి. ఏ. పి. నాగపూరు.**

మన సినిమాలలో వ్యభిచార స్త్రీలకు పురాణ స్త్రీల పేర్లు పెట్టడం— వారిని అవమానించడం కాదా? దీనివల్ల లాభం ఏమిటి? మన పురాణాలలో స్త్రీలంతా ఇలాటివారేనని చాటే ప్రయత్నమిది అనుకుంటాను. మీరేమంటారు.

ఇవన్నీ పట్టించుకోడం శుద్ధ దండుగ అంటాను. కే. శ. ఇ. వి. ఆర్. సేలం వూరేగింపు చేశారు!! ఏం మిగిలింది? ప్రతి రోజు రామాయణాన్ని , గీతనీ వేలాది, లక్షలాది జనం గుడ్డిగా నమ్ముతున్న అనేక నమ్మకాలనీ కాలరాస రూపుమాపాలని ఎంతోమంది పని కట్టుకు లిడుతున్నారు ఏం జరిగింది? . కల్లు పాకల దగ్గిర గోల చేస్తే అవి మూతపడి పోయాయా?! రాములవారిపై పాదరక్షల మాలవేస వూరేగిస్తే— రామనవమి ఉత్సవాలు మానేశారా?! ఇనది సెక్యులర్ దేశం ఎవరి నమ్మకాలు వారి వుండవచ్చు

**జి వి ఆర్ హైదరాబాదు**

మిమ్మల్ని గురించి అసత్యాలు రాస్తున్నప్పుడు మీరెందుకు ఖండించరు?

మనని అర్థం చేసుకోని వాళ్ళదగ్గిర నిజమాడ్డం— యింకా అబద్ధాలని పెంపొందించడమే అవుతుందని— వూరుకుంటాను!

చేసిన తప్పుకి పశ్చాత్తాపపడితే చాలదా? వెళ్ళి కాళ్ళమీద పడి సినిమాల్లో లాగా క్షమించ మనాలా? అక్కర్లేదు. ఆత్మ నిర్వేదానికి మించిన శిక్ష లేదు కదా! పశ్చాత్తాపం చాలు

**ఎస్ ఎ కె నిజామాబాదు**

ప్రతి రంగంలోను స్త్రీ సాధించినంత పురుషుడు సాధించలేక పోవడానికి కారణం?

నిరుత్సాహం, అసంతృప్తి, అహంభావం— ఏ పని ప్రారంభించినా మన శాయశక్తులా దానికోసం పాటుపడాలన్న కనీస కర్తవ్యం విస్మరించడం.

**ఎమ్. వి. విజయనగరం.**

నేను చదివిన చదువు తక్కువ. రచనలు చేయాలంటే చదువు ముఖ్యమా? తెలివి తేటలు ముఖ్యమా?

చదువు, తెలివి అవన్నీ పూర్వం మాటలు— ఇప్పుడు —చదివిన వాడజ్ఞుండదగు— అంటున్నారు. రాయడానికి చదువూ అక్కరలేదు. తెలివి అక్కర లేదు. రాయడం చేతనాలంతే!!

**పి ఎస్. డి. రాజమండ్రి.**

మంచివాడైనా చెడ్డవాడైనా భర్తనే దైవంగా ఎందుకు ఎంచుతుంది స్త్రీ?

మంచివాడైతే జీవితం హాయిగా గడిచి పోతుందనీ, చెడ్డవాడైతే— తన జోలికి రాకుండా గడిపేస్తే చాలునని అనుకుంటుందేమో గాని— దైవంగా భావించదు స్త్రీ. మనిషి అని నమ్ముతుందంటే ●

''రాధతోపాటు సురేష్ చచ్చిపోతాడనుకున్నాం భానూ! రాధ చివరిసారిగా సురేష్‌కు ఉత్తరం రాసింది. ఆ వుత్తరం చూస్తూనే పిచ్చిపట్టిన వాడిలా సురేష్ కార్లో మా వూరు బయలుదేరాడు. కాని ... సురేష్ వచ్చేసరికే రాధ చచ్చిపోయింది. సురేష్ వస్తూ దార్లో యాక్సిడెంట్‌కు గురయ్యాడు. పదిహేనురోజులు హాస్పిటల్‌లో వున్నాడు. చంద్రం బలవంతంపై అమెరికా వెళ్ళాడు భానూ! రాధ ఎందుకలా చేసింది?'' అంది ఏడుస్తూ.

''అక్కయ్య పిరికిగా పారిపోయింది. అన్యాయకంగా చచ్చిపోయింది. పెద్దక్కయ్యను, చిన్నక్కయ్యను చూసాకా ... రాధక్క ఆ నిర్ణయానికి వచ్చి వుంటుంది. నేను అక్కయ్యకోసం ఏం చేయలేక అసమర్థురాలిలా మిగిలిపోయాను ... అంతే.'' అంది భాను.

భానులోని మార్పును చూసిన సుజాతకూడా భయపడింది. ఓ నెలరోజులకు సురేష్ భానుకు వుత్తరం రాసాడు. అతడు రాసిన వుత్తరంలో ప్రతి అక్షరంలో రాధమీద అతనికి గల ఆరాధనను అర్థంచేసుకున్న భాను-

''సురేష్! రాధక్కను మరిచిపొండి! రాధక్కమీద జాలి పడండి. అంతేకాని ... అక్కయ్యను స్మృతిలో నిలుపుకొని బాధపడి మీ భవిష్యన్ని పాడుచేసుకోకండి.'' అంటూ రాసింది.

రోజులు గడిచిపోతున్నాయ్! ప్రతివారం సుజాత వచ్చి భానును పలకరించి పోతోంది. తరుచూ చంద్రం వచ్చి చూసిపోతున్నాడు. తన ఏకాంతాన్ని, ఒంటరితనాన్ని వాళ్ళ అనుభవించనీయకుండా, భంగం చేయడం భాను కిష్టంలేదు. వాళ్ళనేమీ అనలేకపోయింది.

రోజు రోజుకు భానులో స్తబ్దత గూడు కట్టుకోసాగింది. దానికితోడుగా అన్నపూర్ణను చూడాలనుకున్న భాను కోరిక తీరలేదు. వేసవి సెలవు లైపోతూనే, పురుషోత్తమరావు మాష్టారు, మరో ఆరు నెలలు సెలవు పెంచాడని, ఎక్కడ వున్నాడో తెలియదని తెలుసుకున్న భానులో నిరాశ గూడుకట్టుకోసాగింది.

తరుచూ సురేష్ ఉత్తరాలు వ్రాస్తే ఎప్పుడో గాని జవాబు రాసేది భాను. ప్రతి ఆదివారం, సుజాత రాకున్నా, తన కోసం అంటూ వచ్చి, ఆప్యాయతగా పలకరించేవాడు చంద్రం.

మూడు సార్లు, ముగ్గురి జీవితాలతో ఆడుకున్న విధి నాలుగోసారి రావు కూతురైన భాను జీవితంతో ఆట ప్రారంభించింది. ముగ్గురు విధి చేతిలో చిత్తుగా ఓడిపోయారు. భాను ఏమౌతుందో?

''చంద్రం! రాధను మరిచిపోవడానికి ప్రయత్నించు అంటూ పదేపదే చెబుతూ, ప్రతి వుత్తరంలో వ్రాస్తూ వుంటే, నా ప్రయత్నం ప్రతి క్షణం ఓడిపోతోంది. నా కళ్ళనిండా, గుండెలనిండా నిండిపోయిన రాధ నెలా మరిచిపోను చంద్రం! పిరికిగా రాధ పారిపోయింది. నేనూ పారిపోవాలనుకున్నాను. కాని మగాడినైనా నా కా అర్హత లేదంటూ ఆపావు. ఏ ఆశతో బ్రతకమన్నావ్, అందరికి దూరంగా ఈ ఒంటరితనం, రాధ జ్ఞాపకాలకు మరింత సన్నిహితమై పోతున్నాయ్! భాను చాలా

*(గత సంచిక తరువాయి)*

మంచి అమ్మాయి. ఆ అమ్మాయిలో ఎంతో ధైర్యం తెర వెనుక దీపంలా వుంది. ప్రతి వుత్తరంలో నా కెంతో ధైర్యం చెబుతూ వ్రాస్తుంది చంద్రం. నే నింకా బ్రతికే వున్నానంటే మీ యిద్దరివల్లే. అందుకే... నాలా నువ్వు... ఆలోచిస్తూ కాలాన్ని వృధా చేయకు. భాను, రాధ అక్కా చెల్లెళ్ళయినా, మనస్తత్వాలలో చాలా తేడా వుంది. ఈ విషయం




రాధ కూడా నాతో చాలాసార్లు చెప్పింది. నువ్వు అదృష్టవంతుడివి! భానును దూరం చేసుకోకు చంద్రం. మొన్నటి నీ వుత్తరంలో నీ హృదయాన్ని, ఆరాధనను అర్థం చేసుకున్నాను. నీ ఎన్నికలో లోపం లేదు. భానును ఎన్నుకున్నావంటే — నిజంగా నీ జీవితంలో మరేం అంతకంటె విలువైంది పొందలేవు. అందుకే... ఏ ఒక్క క్షణం కూడా భానును వొదలకు చంద్రం. విధి క్రూరమైంది. నా అనుభవాన్ని పాఠంగా నేర్చుకొని... నీ ప్రియ బాంధవిని మాత్రం దూరం చేసుకోకు.'' సురేష్ వ్రాసిన వుత్తరం చదువుకొని వెర్రిగా నవ్వుకున్నాడు చంద్రం. భాను, ఆమె ప్రవర్తన గుర్తుకు రావడంతో గాఢంగా నిట్టూర్చాడు.

''భానూ!'' మూగగా నిలబడ్డ భాను వంక చూస్తూ పిలిచాడు చంద్రం. విజిటర్స్ రూమ్‌లో హడావిడిగా వున్నా, పలక్కుండా విగ్రహంలా నిలబడ్డ భానును, ఎదురుగా నిలబడ్డ చంద్రాన్ని అప్పుడప్పుడు మార్చి మార్చి చూస్తున్నారు కొందరు. అతను వచ్చి పావుగంట దాటినా భాను ఏమీ మాట్లాడ్డంలేదు.

''నా రాక బహుశా మీకు విసుగ్గా ఇబ్బందిగా వుందనుకుంటా!'' చంద్రం మాటలకు ఉలిక్కిపడుతూ చూసింది భాను.

''నేను ... రాకుండా వుండడానికే ప్రయత్నిస్తాను. మరి సెలవ్!'' అంటూ తల వాల్చుకొని వెళ్లిపోతున్న అతనివంక నిర్లిప్తంగా చూస్తూ వుండిపోయింది భాను.

''అతనెంతో ఆత్రుతగా, ఆశగా, నీతో మాట్లాడడానికి వస్తాడు. నువ్విలా మూగిగా వుంటే అతనెంత బాధపడతాడో భానూ!'' నచ్చచెప్పబోయింది భాను రూమ్‌మేట్ నీరజ.

''అతనెంతో మంచివాడు. అతని మాటలో, వ్యక్తిత్వంలోని మంచితనాన్ని బలహీనంగా అంచనా వేసుకొని నువ్విలా నిర్లక్ష్యంగా...'' నీరజ మాటలు పూర్తికాకముందే ''హూష్ ... నీరజా! నీదంతా సినిమా చాదస్తం!'' అంటూ భాను అనేసరికి నీరజకు చంద్రంమీద జాలివేసేది.

భాను బాధను, ఆవేదననేకాదు, చంద్రం ఆరాధనను అర్థంచేసుకున్న నీరజకు, భాను కెలా నచ్చచెప్పాలో తెలిసేదికాదు.

## 22

''భానూ!'' మెల్లగా ఎవరో పిలవడంతో అప్పుడే స్పృహలోకి వస్తున్న భాను, బరువుగా కళ్ళు తెరిచి చూసింది. ప్రక్కనే నీరజ, ఎదురుగా చంద్రమోహన్. చుట్టూ చూసిన భాను అది హాస్పటల్ అని గ్రహించేసింది.

''ఎలావుంది?'' అన్న నీరజ ప్రశ్నకు నవ్వబోయి, తన జవాబుకు నీరజకంటే ఆత్రుతగా చంద్రం ఎదురుచూడ్డం చూసి, నవ్వలేదు భాను. అతని మొహం అంతా పీక్కుపోయి వుంది. జుట్టంతా చెదరి, విశాలమైన అతని ఫాలభాగం మీద చెల్లాచెదురుగా పడివుంది. బట్టలు నలిగిపోయి, మొహంలో నీరసం స్పష్టంగా కన్పిస్తోంది.

''మీరెలా వచ్చారిక్కడికి?'' అంది.

''రెండురోజులుగా భానుకు రాత్రిళ్ళు విపరీతమైన జ్వరం వస్తూ, తెల్లవారేసరికి టెంపరేచర్ తగ్గిపోవడంతో నిర్లక్ష్యంగా కాలేజీకి వెళ్ళింది. నాలుగురోజులు అలా వెళ్ళేసరికి ఐదోరోజు అసలు బెడ్‌మీది నుండి లేవలేకపోయింది.

''భానూ! నీ మొండితనం నిన్నేం చేస్తుందో కాని, చాలామందిని అన్యాయం చేస్తుంది'' అంటూ నీరజ బలవంతంగా హాస్పిటల్‌కు బయలుదేరతీసింది. తీరా రోడ్డుమీదికి వచ్చాకా తను నడవలేక కూలబడిపోయింది. అంతే —

''చూసావా భానూ! నీ మొండితనం, నీమీద నీకుండే నిర్లక్ష్యం, నిన్నేం చేయకపోయినా ఎదుటివాళ్ళను చాలా బాధ పెడుతుంది. పుట్టెడు జ్వరంలో మొండిగా కాలేజికి వెళ్ళగలవ్! రెండు రోజులుగా స్పృహ లేకుండా యిలా మంచంమీద నిశ్చింతగా వుండగలవు. నీ కేమౌతుందోనని హడలిపోయాం!'' అంది నీరజ.

తను... రెండు రోజులుగా స్పృహ లేకుండా యిలా మంచంమీద పడి వుందన్న మాట నమ్మలేనట్టుగా చూసింది భాను నీరజ వంక.

ఇంతలో డాక్టర్ రావడంతో, భాను మౌనం వహించింది.

''నౌ షి ఈజ్ ఆల్ రైట్ చంద్రం!'' అంటూ చెప్పి, మెరిసే కళ్ళతో చూస్తున్న చంద్రాన్ని చూసి, ''థ్యాంక్స్ అయినా చెప్పవేరా చంద్రం! రెండు రోజులుగా గాబరా పడిపోతూ నన్ను కంగారు పెట్టేసావ్!'' అంటూన్న డాక్టర్ మాటలకు చంద్రం అందంగా ఎదుటివారిని క్షణంపాటు, మైమరపించేలా, నవ్విన అతని నవ్వు చూసి, రెండు నిమిషాలపాటు, అతణ్ణే చూసింది భాను.

**జరిగిన కథ 7 :** జగన్నాధరావు చెల్లెలు అన్నపూర్ణ పిల్లల బాధ్యత అన్నపూర్ణ కప్పగించి కన్నుమూస్తుంది జగన్నాధరావు భార్య మహాలక్ష్మమ్మ భాను తన ముగ్గురక్కలవలె కాక నిర్భయంగా మాటాడుతుంది తండ్రితో క్రొత్తగా ఆ వూరు వచ్చిన పురుషోత్తమరావు మాస్టారు జగన్నాధరావు ఇంట్లో ఉంటూ వారి పిల్లలకు ట్యూషను చెప్తుంటాడు భానుకు మాస్టారంటే చాలా ఇష్టం స్కూలు వార్షికోత్సవం నాటకంలో భాను పాల్గొనటానికి అతి కష్టంమీద అంగీకరిస్తాడు రావు వేడి పాల గిన్నె అందుకోటంలో అన్నపూర్ణతో పరిచయమౌతుంది పురుషోత్తమరావుకు రావు గారి ఆవు కుమ్మగా గాయపడిన మాష్టారును చూడటానికి వెళ్ళిన అన్నపూర్ణ అతను ఒంటరివాడని తెలుసుకొని మనసిస్తుంది రావుగారు చెల్లెలికి వేరేసంబంధం చూస్తుంటాడు తన దృఢ నిశ్చయాన్ని అన్నగారికి చెప్పి పురుషోత్తమరావుతో వెళ్ళిపోతుంది అన్నపూర్ణ రాఘవను ప్రేమించిన సత్యకు విశ్వనాధంతో వివాహం బలవంతంగా చేస్తాడు రావు మురళిని ప్రేమించిన రుక్మిణి గోపాలంకు భార్యగా మసలలేకపోతుంది రాధతోపాటు భాను కూడా కాలేజీలో చేరుతుంది సత్య రాఘవను ప్రేమించిందని తెలుసుకున్న విశ్వనాధం ఆమెని అనుమానిస్తాడు అన్నపూర్ణకు పాప పుట్టి మరణించిందని తెలుసుకొన్న భాను బాధ పడుతుంది తండ్రి వేరొకరితో వివాహం నిశ్చయం చేయటంతో సురేష్‌ను ప్రేమించిన రాధ పిరికిగా ఆత్మహత్య చేసుకుంటుంది సత్యకు పాప పుట్టి మరణిస్తుంది రాధ మరణంతో భాను పిచ్చిదానిలా తయారవుతుంది

"ఇతను నా ఫ్రెండ్ భానూ! బి ఎస్ సి లో ఇద్దరం క్లాసుమేట్సుగా మూడు సంవత్సరాలు చదువుకున్నాం రు సుందరం" అన్నాడు

భాను నమస్కరించింది

"వీడూ డాక్టరయేవాడండి కాని మరీ సున్నిత మనస్తత్వం! డాక్టరు కావడానికి వీడికి అర్హత లేదని నే నిచ్చిన సర్టిఫికేటు పుచ్చుకొని బుద్ధిగా ఎమ్ ఎస్‌సి చేసాడు నిజానికి వీడు డాక్టరయితే, ఈ రెండు రోజులు డాక్టరన్న విషయం మరిచి మరింత గాబరా పడేవాడు" అంటూ నవ్వాడు సుందరం

"నువ్వలా తీరా రోడ్డుమీదికి రాగానే స్పృహ తప్పి పడిపోయావ్! నాకు కంగారెత్తిపోయి, ట్యాక్సీని పిలిచేలోగానే చంద్రంగా రొచ్చారు వారే యిక్కడికి తీసుకువచ్చారు ఆ రోజు సాయంత్రం వరకు నీకు స్పృహ రాలేదు ఈ రెండు రోజులుగా నేనైనా హాస్టల్ కెళ్ళాను కాని భానూ! అతను నీ కోసం ఈ రెండు రోజులుగా ఏ ఒక్క క్షణం నిన్ను వొదిలి వెళ్ళలేదు అతని వాలకం చూసావు కదూ! ఆ డాక్టర్ బలవంతపై ఏం తిన్నాడో లేదో నాకు తెలియదు" అంటున్న నీరజ మాటలకు విస్తుపోతూ చూసింది భాను

"భానూ! నువ్వింకా అతణ్ణి అర్థం చేసుకోలేదని నేను అనడంలేదు కాని యిక అర్థం కానట్టు మాత్రం ప్రవర్తించకు నీ యీ మౌనం అతడ్నెంత బాధ పెడుతుందో ఒక్కసారి ఆలోచించు!" అంటూ లేచి, "నేనోసారి హాస్టల్ వరకు వెళ్ళివస్తాను భానూ! నా అవసరం అంతగా వుండదు బహుషా ఎవ్వరిది ఉండదు భానూ! అతనుండగా మరెవ్వరి లవసరం నీ కుండదేమో!" అంటూ, భానుకు వచ్చిన రెండు వుత్తరాలను అందించి వెళ్ళిపోయింది నీరజ ఆమె మాటలు భాను మనసు మీద బాగా పని చేసాయి

నీరజ మాటలకు తోడు సత్య రాసిన ఉత్తరం భానును మరింత ఆలోచించేలా చేసింది

"భానూ! మేము ముగ్గురం రావు కూతుళ్ళుగా మిగిలిపోయాం రాధ కాస్త ధైర్యంగా చచ్చిపోయింది కాని నువ్వెప్పుడు, రావు కూతురుగా మిగిలిపోకు భాను అన్నపూర్ణ కోడలుగా మిగలడానికి ప్రయత్నించు మాలా వంచన జీవితాన్ని ఎన్నుకోకు అత్తయ్యలాగే నీ యిష్టాన్ని నాన్నతో చెప్పు"

"మీ నాన్నగారికి టెలిగ్రాం ఇవ్వమంటారా?" చంద్రం ప్రశ్నకు ఉత్తరం చదివి ఆలోచనల్లో మునిగిపోయిన భాను ఉలిక్కిపడి, అడ్డంగా తల ఊపుతూ, "వద్దు నాకిప్పుడు బాగానేవుంది అనవసరంగా నాన్న గాబరాపడిపోతారు" అంది

"అతనుండగా, బహుశా ఎవ్వరి అవసరం నీకుండదేమొ?" నీరజ మాటలు గుర్తుకువచ్చి, అతనివంక చూసింది దీక్షగా తనవంకే చూస్తున్నాడతను భాను చూడ్డంతో చూపు మరల్చుకున్నాడు దిండుకు తలానించి, కళ్ళు మూసుకున్న భాను ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి కాసాగింది

రావు కూతుళ్ళుగా పుట్టిన తమ జీవితాల్లో ఎందుకు ఈ 'ప్రేమ' అనే పదం చోటు చేసుకుంటోంది? సత్య, రుక్మిణి, రాధల విషయం, సుజాతకు తెలుసు చంద్రానికి కూడా తెలిసే వుంటుంది తెలిసికూడా, తనను తనేం చేయాలి? ఏం చేయగలదు? భగవాన్? ఏమిటిది? ఎందుకిలా జరుగుతోంది? ఫలితం, పర్యవసానం ఎలా వుంటాయి?

బాధ, ఆవేదన, భానును నలిపేస్తుంటే, ఎదురుగా చంద్రం వున్నాడన్న విషయం, వాటిని ఏడ్పుగా బయటికి రానీకుండా, పెదవిని పంటితో నొక్కిపట్టి ఏడ్పు దిగమింగుకుంటూ, కళ్ళు తెరిచి చూసింది కాని ఆగని కన్నీరు చెక్కిళ్ళను తడిపేయడంతో, ఆమెనే చూస్తున్న చంద్రం దగ్గరగా వచ్చి మంచం ప్రక్కనే వున్న స్టూల్ లాక్కొని కూర్చుంటూ, "భానూ!" అంటూ గాభరాగా పిలిచాడు

"మీరెందుకో బాధపడుతున్నారూ?" అన్నాడు లేదన్నట్టుగా తలాడించి తల వాల్చేసుకుంది భాను, తను దాచాలనుకున్న కన్నీళ్ళు అతని కంటబడడంతో

"మీరు నిజం చెప్పలేరు అలా అని అబద్ధం చెప్పకండి భానూ! సుందరం చెప్పాడు మీకు 'రెస్ట్' చాలా అవసరం అని అనవసరంగా ఆలోచిస్తూ బాధపడుతూవుంటే మీ ఆరోగ్యం" అంటూ ఆగిపోయాడు చంద్రం భాను క్షణంసేపు అతనివంక చూసి, దిండులో తలదాచుకొని పడుకుంది

ఆ సాయంత్రం మళ్ళీ టెంపరేచర్ పెరిగింది ఆ విషయం, సుందరం చెబుతూవుంటే, చంద్రం మొహంలో అర్థంకాని బాధ, కంగారు చూసిన భాను, చలించిపోయింది

## *23*

రాత్రి పది దాటిపోయింది భాను యింకా నిద్రపోలేదు చంద్రం, పత్రిక చదువుకుంటూ కిటికీ ప్రక్కనే కూర్చున్నాడు అతనిముందు పత్రిక వుందన్న మాటేగాని, అతని చూపు, మనసు మరెటో వుంది ఆ స్థితిలో అతణ్ణి చూసిన భాను, అతనేం ఆలోచిస్తున్నాడో అర్థం చేసుకుంది

మౌనంగా, నిర్మలంగా వున్న అతని మూగ ఆరాధన తనను అతని వైపు బలంగా లాక్కుపోతోంది కాదనడానికి తన మనసు అంగీకరించడం లేదు అతను యింతవరకు పెదవి కదిపి తన ఆరాధనను వ్యక్తం చేయలేదు కాని గంభీరంగా వుండే అతను, హఠాత్తుగా సర్వాన్ని మరచి, తన వంక చూస్తూ వుండిపోవడం చాలాసార్లు గమనించింది తను మొండిగా అర్థం కానట్టు యింకా ఎంతో కాలం వుండలేదు తన ఈ నిర్లక్ష్యం తననే కాదు, చంద్రాన్ని బాధ పెడుతోంది కాని మరింత బాధ పెట్టే స్థితికి రాకముందే తానో నిర్ణయానికి రావాలి! అవును, కాని ఎలాటి నిర్ణయం? అన్న ప్రశ్న రావడంతో, అన్నపూర్ణ, సత్య, రుక్మిణి, రాధ కదిలారు కళ్ళముందు మరోప్రక్క రావు

"భానూ!" చంద్రం పిలుపుకు కలవరంగా తలెత్తి చూసింది భాను తడిసిన భాను బుగ్గలను, మృదువుగా తుడిచి, "అంతగా ఏడవాలనుంటె, గట్టిగా ఒకేసారి ఏడ్చేయండి భానూ! మీ రిలా లోలోనే క్రుంగిపోవడం మీ ఆరోగ్యానికే ప్రమాదం మీ బాధేమిటో చెప్పమని నేను బలవంతపెట్టను ఎందుకంటే, నేను మీకేం కాలేకపోతున్నాను" అన్నాడు భాను ఉలిక్కిపడుతూ చూసింది

"చివరికి నన్ను ఓ స్నేహితుడిగా కూడా మీరు అంగీకరించడం లేదు బలవంతంగా మీ నుండి నేనేం ఆశించను భాను కాని మీ రిలా బాధ పడ్డం" చంద్రం మాట పూర్తి కాకముందె, 'మీ రిలా చేయడం ఏం బావులేదు" అంది భాను తన మనసు పడే ఆరాటం, ఆవేదన అతను అర్థం చేసుకోవడం లేదన్న కోపం, అతను తనకేం కానట్టు మాట్లాడుతూ వుంటె, కలిగిన ఉక్రోషం భానులో రోషాన్ని పెంచాయి

"నేను మీకేమీ కానప్పుడు మీ రివన్నీ ఎందుకు చేస్తున్నారూ?"

"అలా అన్లేదు నేను నేను మీకేమీ కాలేదు కాని మీరు నాకు ఏమవుతారో నా మనసుకు తెలుసు" అన్నాడు

"మీ మనసుతో నాకేం? అయినా నన్ను హాస్పటల్‌కు తీసుకువచ్చి దయతో పడేసాకా, వెళ్ళిపోక రెండు రోజులుగా అన్నీ మరిచిపోయి యిక్కడే ఎవరుండమన్నారూ? నే నేడిస్తే, ఆలోచిస్తే కారణాలు ఎవరడగమన్నారూ? అసలు నన్నెందుకిలా బాధ పెడుతున్నారూ?" అంది భాను ఏడుస్తూ

అడిగిన ఆ ప్రశ్నలకు నిరుత్తరుడై నిలబడిపోయాడు చంద్రం.

"మీరు నాకేమీ కాలేనప్పుడు యిక్కడెందు కున్నారూ ? వెళ్లిపొండి..." భాను మాటలకు అంతవరకు నిశ్శబ్దంగా, నిశ్చేష్టగా నిలబడ్డ చంద్రం వెళ్లిపోవడాని కన్నట్టు వెనుతిరిగాడు.

"భానూ ! నేను మిమ్మల్ని బాధపెట్టాలనుకో లేదు. నేనేమౌతానో, ఏం కావాలో మీ మాటల ద్వారా తెలుసుకోవాలని నేను చేసిన ప్రయత్నంలో నేను ఓడిపోయాను. మిమ్మల్ని బాధపెట్టినందుకు... ఒకే ఒక్క కారణం, మీ ప్రశ్న లన్నిటికీ ఒకే జవాబు భానూ !" అంటూ చాలా దగ్గరగా వచ్చి భాను మొహాన్ని రెండు చేతుల్లో యిముడ్చుకొని పైకెత్తి, సూటిగా భాను కళ్లలోకి చూస్తూ, "భానూ ! నా జీవితంలో ఎవ్వరూ నాతో ఈ మాట అన్లేదు. నేను ఎవ్వరితో అనే అవసరం రాలేదు. అవకాశం నేనెవ్వరికి యివ్వలేదు. బహుశా యిక జీవితంలో మీకు తప్ప ఈ అవకాశం మరెవ్వరికి వుండదేమో భానూ ! మీరంటే నాకిష్టం. అందుకే మీ మొండితనం, నిర్లక్ష్యం నన్ను బాధ పెట్టినా, భరించి, చివరికి 'వెళ్లిపొండి' అంటూ తరిమేసే వరకు సహనాన్ని పెంచింది. ఎందుకో తెలుసా భానూ ! మీరంటే నాకిష్టం. మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నాను. ఐ లవ్‌యూ భానూ !" అంటూ గబగబా వెళ్లిపోయాడు చంద్రం.

భాను ఆశించిన జవాబు అదే. కాని ఆ జవాబు వినడానికి చంద్రాన్ని ఎంత బాధపెట్టిందో, ఎంత కటువుగా మాట్లాడిందో గుర్తుకురావడంతో, భాను మనసు వెళ్లిపోయిన చంద్రంకోసం, ఆత్రుత పడి అతని రాకకోసం అర్ధరాత్రివరకు ఆశిస్తూ, తనకు తెలీకుండానే నిద్రలోకి జారిపోయింది భాను.

కాని, రెండురోజులు గడిచినా చంద్రం రాలేదు. కాని ప్రతిపూట చంద్రం హాస్పటల్ కొస్తున్నాడని, తనను చాటుగా చూసి, తన ఆరోగ్య వివరాలు కనుక్కొని వెళ్లిపోతున్నాడన్న నిజం తెలిసిన భాను తెలియని ఆవేదన, అభిమానంతో, బాధపడిపోయింది.

ఆ మూడోరోజు కూడా చంద్రం రాకపోవడంతో, యిక హాస్పటల్‌లో వుండలేకపోయింది భాను. సుందరం హాస్పటల్‌లో లేని సమయంలో నర్సు వారిస్తున్నా, వినకుండా, కళ్లనీళ్లు నిండిపోతూ వుండగా, హాస్పటల్ గేటు దాటి రోడ్డు మీదికి వచ్చింది భాను.

అప్పుడే హాస్పటల్ వైపు దూసుకుపోతున్న చంద్రం కారు, భాను ప్రక్కగా ఆగిపోయింది. "భానూ !" అన్న పిలుపుకు తలెత్తిన భాను, చంద్రాన్ని చూస్తూనే, రోషంగా ఏదో అనబోయింది. కాని ... చంద్రం, చిలిపిగా నవ్వుతూ, అమాయకంగా చూస్తూ కారు డోరు తెరిచాడు.

వెనక్కి అడుగు వేయిబోతున్న భాను చేతిని చటుక్కున పట్టుకొని, ఆపి, కారులోనుండి దిగాడు. లాక్కోవడానికి పెనుగులాడబోయిన భానును, చటుక్కున రెండు చేతులతో ఎత్తి సీట్లో కూర్చోబెట్టి భుజం చుట్టూ చేయి వేసి, కారును వెనక్కి తిప్పాడు చంద్రం ఎడ్పు వస్తున్న భాను పెదవి కదిపి అతని ముందు బయట పడడానికి ఇష్టపడక, "నన్ను హాస్టల్ దగ్గర దింపేయండి" అంది చివరికి గొంతు పెగుల్చుకొని. చంద్రం మాట్లాడలేదు. భానును పట్టుకున్న అతని చేయి మరింత బిగుసుకుపోయింది.

యింటి ముందు కారాపుతూనే, వరండాలో నిలబడ్డ, ఓ వృద్ధురాలిని చూస్తూనే భాను మారాం చేయకుండా దిగింది.

"అమ్మగారిని తీసుకువచ్చారా బాబుగారూ ?" అని అంటున్న ఆమె మాటలకు, "ఊఁ... కాఫీ తీసుకురా మరియమ్మా" అంటూ హాల్లో ఓ ప్రక్కగా వున్న ఫోన్ అందుకొని, సుందరానికి భానును తాను తీసుకువచ్చినట్టు ఫోన్ చేసి, కాఫీ తాగాకా, భానును తన గదిలోకి తీసుకువెళ్ళి, "భానూ ! ప్రస్తుతానికి ఇది నీ గది. రెస్ట్ తీసుకో" అంటూ, వెళ్ళిపోతున్న చంద్రాన్ని ఎలా ఆపాలో తెలీలేదు భానుకు.

కాని గుమ్మం వంక [illegible] చంద్రం [illegible] చూసి, భాను విగ్రహంలా కదలకుండా నిలబడి తన వంకే చూడ్డం చూసి, దగ్గరగా వెళ్ళాడు.

"ఏదో అనాలనుకుంటున్నావ్ ! అనేసెయ్ భానూ ! నే నిలా తీసుకురావడం కోపంగా, రోషంగా వుందే తప్ప బాధగా లేదని నాకు తెలుసు. కాని... నీ కోపాన్ని ఎలా ప్రదర్శించాలో తెలీడంలేదు కదూ!" అంటూ నవ్వి, "నేను నిన్ను అర్థం చేసుకున్నాను భానూ ! నేను రాని ప్రతి క్షణం నా రాక కోసం ఎదురు చూస్తున్న నీ మనసు నా కర్థమైందనే నమ్మకంతో నిన్ను ధైర్యంగా తీసుకువచ్చాను. నా నమ్మకంలో అమాయకత్వం ఏం లేదు కదూ?" అని అడుగుతూ, నవ్వాడు చంద్రం.

కళ్ళెత్తి చూసిన భాను వంక రెండు చేతులు చాచిన చంద్రం,భద్రంగా అందని పెన్నిధియేదో అందినంత ఆత్రుతగా, తన గుండెల్లో పదిలంగా దాచు



కున్నాడు భానును. మూడు రోజులుగా గుండెలో రగిలిన ఆవేదన కన్నీటి రూపంలో కరిగిపోతుంటె, "చంద్రం! నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీరు నాకు కావాలి" అంది భాను అస్పష్టంగా.

**24**

"చంద్రం!" హఠాత్తుగా గదిలోకొచ్చిన భానును చూసి ఆశ్చర్యపోతూ చూసాడు చంద్రం. అంత ప్రొద్దునే భాను, హాస్టల్ వొదిలి రావడంతో కాస్త గాబరాపడిపోయాడు. భాను మొహమంతా చెమటతో తడిసిపోయింది. కళ్లనిండా నీళ్లు. మనిషి నిలువునా ఆయాసపడిపోతూ, వొణికి పోతోంది. చంద్రం అడిగేల్లోగానే, చేతిలోని కవరు అతని కందించి నిలబడలేనట్టుగా కూలబడిపోయింది.

అది కృష్ణాపురం నుండి వచ్చింది. ఆరు నెలలుగా లీవ్ పెట్టిన పురుషోత్తమరావు ఈమధ్య రాజీనామా చేసాడని, ప్రస్తుతం మాస్టారు వుంటున్న ఊరు, అడ్రసు, వివరాలు అతనికి స్నేహితుడనిపించుకున్న అతను, భాను వారానికి ఓసారి రాసే ఉత్తరాలకు బదులుగా జవాబు రాసాడు,

"చంద్రం! నన్ను అత్తయ్య దగ్గరికి తీసి కెళ్లవూ?" అంది పసిపిల్లలా ఏడుస్తూ.

భాను ద్వారా అన్నపూర్ణ విషయమంతా విన్న చంద్రం, భాను బాధను, ఆవేదనను, కన్నీళ్లను అర్థంచేసుకున్నాడు. అందుకే ఓదారుస్తూ, "వెడదాం భానూ! నిన్ను నేను తప్పకుండా తీసికెడ తాను" అన్నాడు.

"పద..." అంది భాను అతని చేయి పట్టుకొని లేవదీస్తూ. భాను ఆతృతను అర్థంచేసుకుంటూ, "ఇప్పుడేనా?" అన్నాడు.

"ఊఁ..." అంది, వద్దనకు చంద్రం అన్నట్టుగా చూస్తూ. మరో పది నిముషాల్లో బయలు దేరాడు చంద్రం.

"ఎప్పటికి చేరుకుంటాం?" అంది భాను.

"సాయంత్రం కావొచ్చు!" అన్నాడు చంద్రం. సీటు వెనక్కి చేరగిలబడిపోయి కళ్లు మూసుకుంది భాను.

తాను మరో కొన్ని గంటలలో అత్తయ్యను చూస్తుంది. అమ్మలాంటి అత్తయ్యను చూసి, అత్తయ్య వొడిలో తలదాచుకొని కరువుతీరా ఏడ్చేయాలి. సత్య జీవితం ఎలా అయిందో, రుక్మిణి జీవితాన్ని ఎలా సాగిస్తుందో, రాధ ఎంత పిరికిగా పారిపోయిందో అంతా చెప్పేయాలి. అంతేకాదు, తానెన్నడు అత్తయ్య తనను విడిచి వెళ్లినందుకు

# అన్నపూర్ణ

శపించలేదని, తన కన్నీళ్లు తాకాలని అనుకోలేదని, అత్తయ్య నెన్నడు ద్వేషించలేదని చెప్పేయాలి.

"భానూ!" చంద్రం భాను కళ్లను మృదువుగా తుడుస్తూ, భుజంమీద చేయివేసి దగ్గరగా లాక్కున్నాడు. అతని ఓదార్పు ఆమెను మరింత రెచ్చగొట్టడంతో, అతని భుజంమీద తలానించి ఏడుస్తూనే, ఎప్పుడో నిద్రపోయింది భాను.

సాయంత్రం ఐదు దాటుతూవుండగా చంద్రం కారు ఓ పల్లెటూరు పొలిమేరలోకి ప్రవేశించింది.

బస్ స్టాండులో మాస్టారు గురించి అడిగి, మరో ఐదు నిమిషాలకల్లా ఓ యింటి ముందు కారాపాడు చంద్రం. కారాగడంతోనే చుట్టుప్రక్కల వాళ్ళంతా, వింతగా చూడసాగారు. చంద్రం చేయందుకొని కారు దిగింది భాను. ఎదురుగా కన్పిస్తున్న యింటి వసారాలో వాలు కుర్చీలో వాలి, చుట్టూ చేరిన పదిమంది పిల్లల మధ్య నున్న అతను, కారును చూసి, పిల్లలు అలజడిగా పరుగులు తీయడంలో, కళ్ళెత్తి చూసాడు.

యింటి కెదురుగా అందమైన కారు. ఆ కారు ముందు, మరింత అందమైన జంట. ఇరవై యేళ్ళు నిండిన ఆ అమ్మాయి చామన చాయలో, సన్నగా, నాజూకుగా వుండి, విశాలమైన కనుదోయిలో అందంగా వుండి, ప్రక్కనే హుందాగా, గంభీరమైన ఆజానుబాహువైన అబ్బాయికి తగినట్టుగా అన్పించింది. వాళ్ళెవరోకాని తమ యింటికే వచ్చారని తెలిసి ప్రశ్నార్థకంగా చూడసాగాడు.

"అతను... అతను మాస్టారూ కదూ! మొహానికి మునుపు లేని కళ్ళజోడు... ధోవతి లాల్చీతో... తమవంకే చూస్తున్న... అతను... మాస్టారే." భాను రెప్ప వేయకుండా చూసింది.

"పద భానూ!" అంటూ భాను చేయి పట్టుకొని నడిపిస్తు దగ్గరగా వెళ్ళాడు చంద్రం.

"ఆ అమ్మాయిని ఎక్కడో... ఎప్పుడో చూసాడు. అవును... ఎక్కడో... ఆ రెండు కళ్ళు... అంత అందమైన కళ్ళు...ఒక్క భానుకే వుంటాయ్. పట్టు పరికిణిలో రెండు జడలు ముందుకు వేసుకొని "మాస్టారూ!" అంటూ కబుర్లు చెప్పుతూ కళ్ళు అందంగా తిప్పే ఒక్క భానుకే... "ఈ అమ్మాయి" మాస్టారు పరీక్షగా చూస్తూ జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నిస్తుండగానే, కుర్రాళ్ళు వెళ్ళి వంటింట్లో వున్న అన్నపూర్ణను పిలుచుకొచ్చారు.

గుమ్మంలోకి వచ్చిన అన్నపూర్ణను చూస్తూనే పోల్చుకుంది భాను. అంతవరకు చంద్రం చేతిలో బిగించివున్న తన చేతిని లాక్కొని ఒక్క పరుగులో, అన్నపూర్ణను చేరుకొని, రెండు చేతులను ఆమె మెడ చుట్టూ పెనవేస్తూ, "అత్తయ్యా!" అంటున్న భాను పిలుపు, భాను చేతుల స్పర్శ, కొన్ని ఏళ్ళ కిందటి జ్ఞాపకాలను, స్మృతిలోకి తేవడంతో "భానూ!" అంటూ గుండెలకు హత్తుకుంది అన్నపూర్ణ. పసిపిల్లలా, బావురుమని ఏడుస్తున్న భానును, నిశబ్దంగా ఏడుస్తూ, మరింత మరింత దగ్గరగా గుండెల్లో దాచుకుంటూ, "తన వొళ్ళో పెరిగిన భాను, ఆనాటికి ఈనాటికి తనకు ప్రాణమైన భాను... వచ్చేసింది. తనను వెదుక్కుంటూ, తన గుండెల్లో వొదిగిపోవాలని, బోసిపోయిన తన వొడి నింపాలని వచ్చేసింది." అని ఆలోచిస్తున్న అన్నపూర్ణ మనసు ఆనందంతో నిండిపోయింది. భాష కందని భావావేశంతో తెలియని స్థితి ఆవరించిన అన్నపూర్ణను, భానును చూసిన మాస్టారు దోషిలా తల వాల్చుకున్నాడు. ఆనాటి తొమ్మిదేళ్ళ భానులానే అన్నపూర్ణ దగ్గరికే కాదు, తన దగ్గరికి వచ్చిన భానును దగ్గరికి తీసుకోవడానికి భయమేసింది ఆయనకు.

"నామీద మీ యిద్దరికీ కోపంగావుంది కదూ మాస్టారూ? పాప చచ్చిపోవడానికి కారణం నేను కాదు మాస్టారూ! నేనెన్నడు నా కన్యాయం జరిగిందనికాని, అత్తయ్య నన్ను విడిచివెళ్లినందుకు గాని, మీరు నాకు దూరంగా అత్తయ్యను తీసి కెళ్లారని నిందించలేదు. నా కన్నీళ్లు తగిలే పాప చచ్చిపోయిందన్నాడు నాన్న! మీరూ ఆమాటే నమ్ముతున్నారా మాస్టారూ!"

"ఛ...లేదమ్మా భానూ! పాపే బ్రతికివుంటే ఈనాడు ఈ అత్తయ్య నీకు కన్పించేది కాదు. అత్తయ్యతోపాటు ఈ దౌర్భాగ్యపు మాస్టారు కన్పించేవాడు కాదు!" అని అంటున్న మాస్టారు నోరు మూసేస్తూ "అలా అనకండి మాస్టారూ!" అంది భాను.

సత్య, రుక్మిణి, రాధ, జీవితాలు ఎలా అయ్యాయో విన్న అన్నపూర్ణ, కన్నకూతుళ్లు అన్యాయం అయిపోయినంతగా ఏడుస్తూ బాధపడిపోయింది.

"అన్నయ్య మొండితనం చివరికి అన్నయ్యకేం మిగలకుండా చేసింది భానూ!" అంటూ, రావును తలచుకొని బాధపడింది.

చంద్రాన్ని చూసి విషయాన్ని పసికట్టిన అన్నపూర్ణ, రావు మొండితనం భానును దూరంచేస్తే, ఒంటరిగా మిగిలే అన్నయ్యకు తోడెవరు? అంటూ ఆక్రోశించింది. తండ్రి గురించి అంతగా బాధ పడుతూ, ఆలోచించే అన్నపూర్ణను చూసి, భాను గర్వపడింది. "కన్నకూతుళ్లకు తండ్రిగా మిగిలి పోకున్నా, నీకు అన్నయ్యగా మిగిలాడు అత్తయ్యా!" అంది.

రెండురోజు లుండి చంద్రంతో వెళ్లిపోతున్న భానును చూసి, "బహుశా అన్నయ్య ఒంటరిగా మిగిలిపోతాడేమో!" అంటూ బాధపడింది అన్నపూర్ణ.

(28వ పేజీ చూడండి)

## * ఇంటింటి చిట్కాలు *

★ అగ్గిపుల్లలు చెమ్మగిలి వెలక్కుండా పోతాయి వానాకాలంలో. అగ్గిపెట్టెలో నాలుగైదు బియ్యం గింజలు పడేయండి. దివ్యంగా వెలుగుతాయి.

జాడీలో గాని, కుండలోగాని ఉప్పుపెట్టి ఉంచితే నీరు ఊరుతూనే వుంటుంది. ఉప్పు పొడిగా ఉండాలంటే ఉప్పు పోసేముందు చిన్న బ్లాటింగు పేపరు ముక్క వెయ్యండి. పొడిపొళ్లాడుతూ వుంటుంది

★ బూజు పట్టినట్టు గొడుగు పైభాగంలో తెల్ల తెల్లగా తయారవుతుంది. లిక్విడ్ అమ్మోనియా రెండు చుక్కలు గోరువెచ్చటి నీటిలో వేసి బ్రష్‌తోనో, పాత బట్టతోనో రుద్దితే గొడుగు కొత్త గొడుగులా మెరుస్తుంది.

★ తడిసిన జోళ్లు కొయ్యబారుతాయి. రెండు బొట్లు గ్లిజరినో, ఆముదమో వేసి రుద్దితే ఎప్పటిలాగే మెత్తబడతాయి.

— ఎస్. హేమగిరిబాబు



"తాతమ్మకల"లో రామారావు, భానుమతి

## పాపులర్ స్టార్

## తాతమ్మ కల

చిత్రం గొప్పగా వున్నదని విశ్వసించదగిన వ్యక్తులు చెప్పారు. నటరత్న బాగా చేశారా లేక మహానటి భానుమతి బాగా చేశారా అన్న అంశాన్ని ప్రేక్షకులు తేల్చాల్సిందే అన్నారు మరికొందరు.

చిరంజీవి. బాలకృష్ణ పాలబుగ్గలు ప్రదర్శించిన ప్రశాంతమైన నటన చిత్రానికి జీవం పోసినట్టు వార్త. డైలాగును చెప్పడంలో చిరంజీవి తీసుకొన్న శ్రద్ధను గూర్చి కొందరు గొప్పగా చెప్పారు. కథలో కొత్తదనం వున్నదని కొందరు, కథనంలో బిగువు వున్నదని కొందరు, దర్శకత్వంలో మాస్టరీ కనిపించిందని కొందరు చెప్పిన విషయాలను విన్నప్పుడు నాకు అనిపించింది ఒక్కటే. ప్రేక్షకులు ఎన్నో ఆశలు పెట్టుకొన్నందుకు యీ చిత్రం వాళ్లను విశేషంగా ఆకర్షిస్తుందని.

ఎన్టీఆర్ నిర్మించే చిత్రాలకు ఎంత పవిత్రత, శీలత వుంటుందో ప్రేక్షకులకు తెలియదా? దర్శకత్వంలో ఎంత జాగ్రత్త, శుభ్రత వుంటుందో ప్రజలకు తెలియదా? "తాతమ్మ కల" చిత్రంలో రాజేశ్వరరావు ప్రతిభ ప్రతి పాటలో కనిపిస్తుంది. పాత్రధారు లందరిచేతా మోతాదు మించకుండా నటింపచేశారు, దర్శకుడు రామారావు. ముఖ్య పాత్రలను హరికృష్ణ, విజయలలిత, శుభ, రాజబాబు, ఎం పి ప్రసాద్ పోషించారు. కాంచనకు చక్కటి వేషాన్ని యిచ్చారు. ఆ వేషంలో కాంచన చక్కగా చేసినట్లు సార

ఇప్పటికీ ప్రజల దృష్టిలో పాపులర్ స్టార్ ఎవరయ్యా అంటే – రామారావు అని కొందరు, నాగేశ్వరరావు అని కొందరు అంటారు. వాళ్లు అనే మాటలు నిజాలు గాకపోతే నాగేశ్వరరావు, రామారావు నటించిన ఇద్దరు మిత్రులు, బుద్ధిమంతుడు, కోడలు దిద్దిన కాపురం, జయసింహ చిత్రాలు కొత్తగా విడుదలయ్యే చిత్రాలకన్నా ఎక్కువగా వసూళ్లను తెచ్చిపెట్టగలవా?

ఆ రోజుల్లో నిర్మించిన చిత్రాలలో బలమైన కథ వుండేది. పాత్రలలో న్యాయం, రియలిజం వుండేది. సంగీతం బాగుండేది. డైలాగ్సు బాగుండేవి. అందరూ సమైక్యంగా పని చేశారన్న భావాన్ని కలిగించేది. ఇప్పుడొచ్చే చిత్రాలలో భారీ సెట్స్, రంగుల ప్రతాపం, కల్తీ సరుకు కనిపిస్తున్నాయి.

# సినిమా

బరువైన పాత్రే యివ్వబడింది నాయిక విషయంలో మాత్రం ఆదుర్తిగారు ఒక నిర్ణయాన్ని తీసుకొని, జరీనా అనే క్రొత్త అమ్మాయిని తెలుగు తెరకు పరిచయం చేస్తున్నారు. ఆయన హస్తవాసి ఎలాంటిదో మనం వేచి చూద్దాం.

అంజలీదేవి, కాంతారావు, చంద్రమోహన్, సూర్యకాంతం, ఛాయాదేవి, నిర్మల, పుష్పకుమారి, సాక్షి రంగారావు, మాదా ముఖ్య పాత్రలను పోషించే ఈ చిత్రానికి మహదేవన్ సంగీతాన్ని, రామకృష్ణారావు ఛాయను. సత్యానంద్ రచన్ను సాగిస్తున్నారు. యం. యస్. ప్రసాద్, ఆదుర్తి భాస్కర్ నిర్మాతలు.

ఆదుర్తి దర్శకత్వం గూర్చి వేరే చెప్పాలా! ఆదినుంచి తన పవితనాన్ని ప్రత్యేకంగా ప్రతిభతో చూపించడం అలవాటు. ఈ చిత్రం చూచిన వ్యక్తులు చిత్రంలోని ఘట్టాలను, అవి చిత్రీకరించబడిన పద్ధతులను పదేపదే చెప్పుకుంటున్నారు. ఆదుర్తి కీర్తి మరో అడుగు ముందుకు వేస్తుందన డంలో సందేహం లేదు.

## రాజు జరిపిన రవి పుట్టినరోజు

విజయలక్ష్మీ మూవీస్ వారి చిత్రం "అమ్మ మనసు"లో బాలవిహార్‌కు చాలా ప్రాముఖ్యత వుంది. ఈ బాలవిహార్‌ను చుట్టే చిత్ర కథ అంతా నడుస్తుంది. బాలవిహార్‌లో వార్డు బాయ్‌గా పనిచేస్తున్న రాజుకు అనుకోకుండా జాక్‌పాట్ వస్తుంది. అతను లక్షాధికారి అవుతాడు. విత్తం చేతికి రాగానే, బాలవిహార్‌ను అయితే విడిచి వెళ్లాడేగానీ, అక్కడి పాపలను తన హృదయం నుంచి దూరం చేసుకోలేక పోయాడు. రోజూ అక్కడికి వచ్చి వార్ని విచారించి గాని మరి వెళ్లడు. అందరి పాపల్లోకి రవి అంటే



"ఎవరికి వారే యమునాతీరే"లో రోజారమణి

## రోజాకు మరొక మంచి పాత్ర

"ఓ సీత కథ" లో రోజా చేత క్లిష్టమైన పాత్రను ప్రేక్షకులు యిష్టపడే విధంగా చేయించారు, కాశీనాధుని విశ్వనాథ్.

అదే రోజా చేత మరొక కష్టమైన పాత్రను ప్రజలు యిష్టపడే విధంగా చేయిస్తున్నారు, దాసరి నారాయణరావు.

చిత్రం పేరు : "ఎవరికివారే యమునాతీరే". ఈ చిత్రాన్ని డిడ్డికుమార్ (బాబ్ అండ్ బాబ్ ప్రొడక్షన్స్) నిర్మిస్తున్నారు. ఇందులో రోజా ధరిస్తున్న పాత్రను గూర్చి నాలుగు వాక్యాలు రాస్తాను.

దేవుడు రోజాను పుట్టు గుడ్డిగా పుట్టించాడు. చిన్నతనంలోనే నాన్నను తనలో చేర్చుకొన్నాడు. తల్లి మంచాన పడింది. పున్న అన్నయ్య యింట్లో వుంచిన డబ్బును కాజేసి వెళ్లాడు. మంచం పట్టిన తల్లి ఆమె భర్త సన్నిధికి వెళ్లి, రోజాను ఒంటరి దాన్ని చేసింది. నా అన్నవాళ్లు లేని రోజాను ఒక అమృతమూర్తి చేరదీశాడు. అన్నం పెట్టి కంటికి రెప్పలా కాపాడి మహాత్ముడు అయ్యాడు. అట్టి త్యాగమూర్తికి ఋణం తీర్చుకోగలిగిందా రోజా? అదేమో... "ఎవరికివారే యమునాతీరే" చిత్రంలో దర్శకుడు దాసరి ఎలా పరిష్కరించారో? అమృతమూర్తిగా రాజబాబు నటించే యీ చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య,



ఎన్టీఆర్ నటన కోసం, బాలకృష్ణ ప్రతిభను చూడడం కోసం, భానుమతి ప్రత్యేకత కోసం ''తాతమ్మ కల'' చిత్రం అఖండ విజయాన్ని సాధించడం తథ్యం. ఈ చిత్రానికి త్రివిక్రమరావు నిర్మాత.

## వచ్చేవన్నీ ప్రజలు మెచ్చే చిత్రాలే

ఆగస్టు 30 న ''తాతమ్మ కల'' చిత్రం వస్తుందా? అందులో ఎన్టీఆర్ ఎంత గొప్పగా చేశారో చూస్తారా? అది వచ్చిన నెలకల్లా పద్మజా మూవీస్ వారి ''దీక్ష'' చిత్రం వస్తుంది.

తన తండ్రిని పొట్టనపెట్టుకొని, తన తల్లి ముదుట కుంకుమ లేకుండా చేసిన దుర్మార్గుడ్ని వెతికి, వాడిచేత నిజం చెప్పించి, వాడి అంతం చూసిన నాయకుడిగా ''దీక్ష''లో నటించారు. ఆయనకు జతగా జమున నటించింది. ప్రత్యగాత్మ — రామారావు పదేండ్ల తరువాత కలిసి పనిచేసిన ఈ చిత్రం ప్రజాదరణ పొందుగాక! ఈ చిత్రాన్ని కె కుటుంబరావు, వజ్జె సుబ్బారావు నిర్మించారు.

''దీక్ష'' విడుదలయిన నెలకల్లా ''నిప్పులాంటి మనిషి'' చిత్రం వస్తుంది. ఇది రంగుల చిత్రం. నీతిగా, నిజాయితీగా వుంటూ చట్టాన్ని, న్యాయాన్ని జీవిత పరమావధిగా భావించి దుష్టులకు, సంఘద్రోహులకు శిక్ష విధించిన పుత్తమ నాయకుడి పాత్రను ఎన్టీఆర్ పోషించారు. ఆయనకు జతగా లత నటించింది. సత్యనారాయణది వెరైటీ వేషం. వై. వి. రావు నిర్మించే ఈ చిత్రానికి ఎస్ డి. లాల్ దర్శకుడు.

''నిప్పులాంటి మనిషి'' తరువాత వచ్చే చిత్రం తారకరామ పిక్చర్స్‌ది. ఇందులో అమాయకుడిగా, మంచిని పెంచే మనిషిగా, సినిమా హీరోగా వైవిధ్యం వున్న వేషాన్ని ఎన్టీఆర్ పోషించారు. ఆయనకు జతగా వాణిశ్రీ నటించింది. కె. దేవి వర్షప్రసాద్ నిర్మాత; దర్శకుడు డి. యోగానంద్.

తారకరామ పిక్చర్స్ వారిది కాగానే, ''శ్రీ రామాంజనేయ యుద్ధం'' కలర్ చిత్రం దర్శనమిస్తుంది. దివినుండి భువికి అవతరించిన పురాణ పురుషుడూ అన్న వున్న పేరును సార్థకంచేసే శ్రీరాముడి పాత్రను రామారావు పోషించ, చిత్ర విజయాన్ని గూర్చి వేరే వ్రాయాలా? సీతగా సరోజాదేవి నటిస్తున్నది. ఈ చిత్రానికి పి. వెంకట నారాయణ, ఎన్. ఎస్. మూర్తి నిర్మాతలు. బాపూ దర్శకుడు.

నేను ఉదహరించిన వేషాలను బట్టి, రామారావు నటించిన చిత్రాలలో వెరైటీ వున్నదా, లేదా అన్న విషయాన్ని పాఠకులకు వదిలేస్తున్నాను



''అమ్మ మనసు''లో ఒక దృశ్యం

## రవి కళా మందిర్ వారి మరో రంగుల స్వప్నం

రవి కళా మందిర్ వారు లోగడ ''మాయదారి మల్లిగాడు'' చిత్రాన్ని నిర్మించి, తొలి చిత్రంతోనే పెద్ద సంస్థల జాబితాలో చేరిపోయారు. ఆ చిత్రంలో హీరో కృష్ణకు వెరైటీ పాత్ర నిచ్చి, క్వాలిటీ నటన్ను చూపెట్టేటట్టు చేసారు ఆ చిత్ర దర్శకుడు ఆదుర్తి. ఇక ఆ చిత్రం నాయిక మంజుల విషయం చెప్పక్కరలేదు. ఆ చిత్రంతో దాదాపు పది చిత్రాల నాయికై కూర్చొందిపుడు.

ప్రస్తుతం అదే సంస్థ మరొక రంగుల స్వప్నాన్ని తయారు చేస్తోంది. ఇందులోకూడా కృష్ణకు



''దీర్ఘ సుమంగళి''లో ఒక దృశ్యం

రాజుకు అమిత ప్రేమ. రవి చెప్పిన నెంబర్ల వల్లనే తనకు జాక్‌పాట్ వచ్చిందన్న కారణంగా సగం రవి పేర వేశాడు రాజు. రవి పుట్టిన రోజును ఘనంగా జరిపాడు. ఆ సందర్భంలో ఈ పాట పాడాడు.

''ఎన్నేళ్ళమ్మా — ఎన్నేళ్ళూ? చిన్నారి బాబుకూ— ఎన్నేళ్ళు? కన్నతల్లికే తెలుసు. ఎన్నేళ్ళో! కన్నీళ్ళకే తెలుసు — ఎన్నేళ్ళో.''

రవికి ఏం సంబరం జరిగినా డాక్టర్ మాధవి తప్పకుండా అక్కడికి హాజరు.

దేవులపల్లి వ్రాసిన పై పాటను మహదేవన్ సారథ్యంలో బాలసుబ్రమణ్యం పాడరు. కె. విశ్వనాథ్ దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో చలం, భారతి, జయంతి, సత్యనారాయణ మున్నగువారు నటించారు. ఈ చిత్రానికి జి. వి. ఎస్. రాజు నిర్మాత.

## మల్లికార్జునరావుకు అంగీకారం

''పసి హృదయాలు'' చిత్రం ప్రజా హృదయాల్ని ఆకర్షించింది. ఆ చిత్రానికి ఎం. మల్లికార్జునరావు దర్శకుడు. ఈ మధ్య ఆయన్ను కృష్ణ యింటి దగ్గర చూశాను. అంగీకారం వచ్చిందా అని ప్రశ్నించాను. ''హీరోకు కథ బాగా నచ్చింది. ఓ. కే. అన్నారు. సెప్టెంబరు నుండి కాల్‌షీట్లు యిస్తా నన్నారు'' అని జవాబిచ్చారు.

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిత మయ్యే యీ చిత్రంలో కృష్ణ, మంజుల ప్రధాన జంటగా నటిస్తారని ఆయన చెప్పారు.

''నిలబడి నీళ్లుతాగే మనస్తత్వం మల్లికార్జునరావుది. అందుకే స్పీడుగా చిత్రాలను సరఫరా చెయ్యడం ఆయనకు చేతకాదు. సంవత్సరానికి ఒకటి విడుదలై, ప్రజలను తృప్తి పరచగలిగితే చాలు'' అంటా రాయన. ఇంతవరకు ఫ్లాప్ చిత్రం తీయలేదనుకొంటాను. నిర్మాతల పెట్టుబడికి యిబ్బంది తెచ్చే రకం కాదు.

... కుమారి, నిర్మల, శశిరేఖ ముఖ్య పాత్రధారులు. ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతాన్ని, కన్నప్ప ఛాయను, జి. వి. ఎస్. శాస్త్రి సహాయ దర్శకత్వాన్ని చేపట్టారు.

## కిరణ్‌లో కొత్తవాళ్లు

కొత్తవాళ్లతో కలర్ సినిమా తీస్తాము అని కిరణ్ ప్రొడక్షన్స్ ప్రకటన యిచ్చారుగా. మాట నిలబెట్టుకొన్నారు. కొందర్ని ఎన్నిక చేసినట్టు చెప్పారు

హీరోగా ఆనంద్, సహాయ పాత్రలను సత్యప్రియ, భవానీ, విలన్‌గా తాతారావు నటిస్తారు ఈ ఆనంద్‌ను మూడుమాసాల క్రితం యిదే పత్రికలో పరిచయం చేసిన విషయం పాఠకులకు గుర్తుందనుకుంటాను.

కొన్ని పాత్రలకు నటీనటులు దొరకని కారణంగా



''తిరపతి''లో అల్లు రామలింగయ్య, గిరిజ

పరిశ్రమలో పాతుకుపోయిన పాతవాళ్లను పెట్టవలసి వచ్చింది అన్నారు పి. వి. సత్యనారాయణ. [సూర్యకాంతం, అల్లు రామలింగయ్య, రమాప్రభ, కె. వి. చలం]

ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు కొత్తవాళ్లచేత బాగా చేయించగల ప్రతిభావంతుడు దీనికి కథ, మాటలను సత్యానంద్ వ్రాశారు. సంగీతానికి మహదేవన్, ఛాయకు లక్ష్మణగోరే ఎన్నుకోబడ్డారు. ఈ చిత్రానికి వై. కిష్టఫర్, పి హనుమంతరావు నిర్మాతలు.

స్టుడియో ప్రమేయంలేకుండా, ఏదేని ఒక పెద్ద భవంతిలో షూటింగును జరపడానికి నిశ్చయించారు

## ఊర్వశిని మెచ్చిన భరత్!

''శారద'' వంటి వుత్తమ చిత్రాన్ని అందించిన అన్నపూర్ణా సినీ ఎంటర్ ప్రైసెస్ వారు ''ఊర్వశి'' వంటి విలువైన చిత్రాన్ని నిర్మించారు. ఈ చిత్రంలో నలుపు, తెలుపుల భావ సంఘర్షణ ముఖ్య అంశముగా కనిపిస్తుంది.

నల్లమ్మాయిగా శారద, తెల్లమ్మాయిగా ఊర్వశి గ్రహీత ద్విపాత్రాభినయం అద్వితీయంగా చేసినట్టు, భరత్ గ్రహీత సంజీవకుమార్ ప్రశంసించాడు. హిందీలో ఎన్నో చిత్రాల నాయకుడిగా వుండి, తెలుగు చిత్రంలో సంజీవ్‌కుమార్ నటించాడంటే, అతడు చేపట్టిన పాత్రలో ఏదేని ప్రత్యేకత వుండాలిగా?

నలుపురంగు నల్లగా, తెల్లరంగు వెన్నెల చల్లగా వుండాలనే ఈ చిత్రం కలర్‌లో నిర్మించబడింది అన్నారు నిర్మాత పి. రాఘవరావు. ఈ చిత్రానికి ట్రీట్‌మెంట్ రాసిన క్రాంతికుమార్ అసాధ్యుడు. ఈ చిత్రానికి సంగీతం సమకూర్చిన చక్రవర్తి చతురుడు. ఇందులో నటించిన రాజబాబు అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, పుష్పలత, రాజశ్రీ, విజయ + సత్యనారాయణ నిష్ణాతులు.

''ఊర్వశి''లో శారద

''ఊర్వశి'' చిత్రమంతా మైసూర్ ప్రీమియర్ స్టుడియోలో పూర్తయింది. ఈ చిత్రానికి కె. బాపయ్య దర్శకుడు.

బాపయ్యా, నీలో యింత గొప్పతనం వుందని చెప్పేవుకాదయ్యా అని నిరూపించే నిరుపమాన చిత్రం యిది.

## శారదకు కఠిన శిక్ష

మంచితనానికి ప్రతిరూపమైన శారదను అనవసరంగా, నిష్కారణంగా జైలుకు పంపించాడు ఒక వంచకుడు.

చెప్పేవి శ్రీరంగ నీతులు... చేసేవి దుర్మార్గపు పనులు అనెడి నానుడికి న్యాయం చేసే వ్యక్తి రావి కొండలరావు.

అయినవాళ్లు, దగ్గరివాళ్లు పెట్టే బాధలను భరించలేక పాడుబడిన సత్రంలో తల దాచుకునేందుకు వస్తే, ఎవరో చేసిన దొంగతనం ఆమెపై నెట్టి పోలీసులకు అప్పగించిన యీ సతిఘాన్ని ఏమనాలి?

తాళి కట్టిన వ్యక్తి తప్పు తెలుసుకుని, ఆమె కోసం గాలించాడు. తన అర్ధాంగిని జైలులో చూసి నిర్ఘాంతపోయాడు. ఆమెను విడిపించి, యింటికి తీసికెళ్లాడు. ఆమెకు భర్తగా కృష్ణంరాజు నటించాడు.

శారదకు జైలువాసం ఏర్పడిన యీ ఘట్టం మమతా వారి ''పల్లె పడుచు'' చిత్రంలో కనిపిస్తుంది. ఇది కేవలం కథ కాదు. ఒక దీనురాలి జీవిత వ్యథ. మంచితనానికి వచ్చిన బాధ. ఈ చిత్రానికి ఎడిటర్ సత్యం దర్శకుడు. మాటలను బొల్లిముంత, సంగీతాన్ని రాజేశ్వరరావు, ఛాయను థామస్ నిర్వహించారు. ప్రధాన పాత్రలను అంజలీదేవి, రాజబాబు, రమాప్రభ, విజయలలిత, జ్యోతిలక్ష్మి, మిక్కిలినేని, త్యాగరాజు పోషించారు. ఈ చిత్రం ఆగస్టులో విడుదల అవుతుంది.

## జి. కె. మూర్తి దర్శకత్వంలో ఆదిమానవులు

చేతనా కంబైన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న ఈ చిత్రం భారత చలనచిత్ర చరిత్రలో నూతన శకాన్ని ఆరంభిస్తుంది. ఆనాటి మానవుడి స్థితి, పరిస్థితిని ఎన్నో గ్రంథాలను పరిశీలించి తదనుగుణంగా వ్రాయబడిన ఈ కథను పి. సూరిబాబు, శేఖర్, వజ్జె సుబ్బారావు చలనచిత్రంగా నిర్మిస్తున్నారు.

## సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్

ఒంటరి తనానికి గుడ్‌బై కొట్టేసారు చంద్రమోహన్, లక్ష్మి. చంద్రమోహన్, లక్ష్మి గాఢంగా ప్రేమించుకున్నారు. ప్రేమికుల మనసుల్లో ఎన్నెన్నో వింత కోరికలు జనించడం సహజం. కానీ కోరుకున్నవన్నీ తీరాలంటే పెండ్లి అనే పెద్ద ఆటంక మొకటుంది. పాపం! వీరిద్దరి గతి గూడా అదేలా తయారైంది. ఎలా గబ్బా! అనుకుంటుండగనే ఇద్దరికి వివాహం జరిగింది. ఇక ఆగుతాయా ఆ లేత వయస్సుల భావ తరంగాలు. మనసు విప్పి చెప్పుకోలేని మాటలను మూడు ముళ్ల బంధం ఏర్పడగానే మనసారా చెప్పుకోవడం మొదలెట్టారు చంద్రమోహన్, లక్ష్మి.

''ఒంటరి తనానికి ఇక సెలవు
ఊహాగానానికి ఇక సెలవు!
నిరీక్షణలకు, నిట్టూర్పులకూ
కలవరింతలకు పలవరింతలకు
సెలవు! సెలవు!'' అంటూ పెండ్లికి ముందు తామనుభవించిన ఒంటరితనాన్ని తరిమి, తరిమి కొట్టారు పాట రూపంలో. నారాయణరెడ్డి వ్రాసిన పై పాటను సుశీల, రామకృష్ణల చేత పాడించారు సంగీత దర్శకుడు చలపతిరావు. ఇంతకూ చిత్రం ఎవరిదో చెప్పలేదు కదూ! సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ వారి క్రొత్త చిత్రానికి గానూ నిర్మాత, దర్శకుడు కె. హేమాంబరధరరావు చిత్రీకరించారు

## జయసుధ పేరాశ

రామకృష్ణ గొప్ప ధనవంతుడు. గుణవంతుడు కూడా. లౌక్యం తెలియని అమాయకుడు. పంచన చేరినవార్ని పరితాపంతో చూచే దయార్ద్ర హృదయుడు. ఇవన్నీ ఆసరాగా తీసుకొని అతని వద్ద పి. ఏ. గా పని చేస్తున్న జయసుధ అతన్ని ప్రేమించింది. పవిత్రంగా ప్రేమించి వుంటే సుఖంగా వుండేది. కానీ అతని డబ్బును ప్రేమించింది అనడం కన్నా కామించింది. అందుకోసం తన అన్న శరత్ బాబుతో కలసి అతన్ని చంపడానికి కూడా తెగించింది చివరకు ఒక పాముకు జడిసి, అనవసరంగా నిందు



''ఏసు మహిమ''లో కె. కె. శర్మ, కొత్త హీరో రాఘవన్



''నోము''లో ఒక దృశ్యం

జీవితాన్ని నాశనం చేసుకుంది. పేరాశకు పోతే ఫలితం ఏమిటో ఋజువైంది.

ఎమ్. కె. యస్. బి. వారి ''నోము'' వర్ణ చిత్రంలో పై కథ అంతా జరిగింది. పాము కోరల్లో విషం మాత్రమే వుంటుంది, అది పగబడితే ప్రాణాలు తీస్తుందన్న విషయం నిజమే అయినా, అదే పాము తనను భక్తితో కొలిచేవార్ని అడుగడుగునా నీడలా కాపాడుతుందనడానికి ''నోము'' వర్ణ చిత్రం ప్రత్యక్ష నిదర్శనం. ఇందులో రామకృష్ణకు జతగా చంద్రకళ, చంద్రకళ తాతగా వై. వి. రాజు, హీరో నేస్తంగా కె. వి. చలం నటించారు.

## ప్రకాశం పథకం!

''కాలం మారింది'' చిత్రం అవార్డును తెచ్చి పెట్టింది. పల్లెపడుచు చిత్రం విడుదలముందే విత్తాన్ని తెచ్చియిచ్చింది. మొదటి చిత్రంలో శోభన్‌బాబు, శారద సహకరించ, రెండవ చిత్రంలో శారద, కృష్ణంరాజు, ఆవు తోడ్పాటు నివ్వడం జరిగింది. ఎలాగయితేనేం? ప్రకాశం నిర్మాతగా నిలదొక్కుకొన్నాడు.

ఇప్పుడు రెండు రంగుల చిత్రాలను తల పెట్టాడు. ఒక చిత్రంలో కృష్ణంరాజు ముఖ్య నటుడు. అడవి దొంగగా వెరైటీ వేషాన్ని కృష్ణం రాజు ధరిస్తున్నాడు. ఎడిటర్ సత్యం దర్శకుడు.

మరొక చిత్రం పేరు 'ప్రెశిడెంట్ పేరిందేవి'. శారద ముఖ్య నటి. కథను దాసం గోపాలకృష్ణ వ్రాశాడు. దర్శకుడు నిర్ణయం కాలేదు. ఇందులో శారద చిలక జోస్యం చెప్పే మామూలు మనిషిగా పరిచయమై, మంచితనంతో ప్రజల మెప్పును పొంది ప్రెశిడెంట్ పేరిందేవి అవుతుంది.

కృష్ణంరాజు నటించే చిత్రం షూటింగు ఆగస్టులో ఆరంభం. శారద నటించే చిత్రం అక్టోబరులో ప్రారంభం. ఈ వివరాలను మమతాధి నేత వాశిరాజు ప్రకాశం వెల్లడించాడు.

## వీణలో వాణిశ్రీ ప్రావీణ్యం

వాణిశ్రీ అద్భుతంగా నటించగలదని మాత్రమే తెలుసు. కానీ ఆమె అమోఘంగా వీణ వాయించ గలదన్న నిజాన్ని యిటీవల తెలుసుకొన్నాను.

సురేష్ మూవీస్‌వారి రంగుల స్వప్నం ''చక్రవాకం''లో వాణిశ్రీ వీణ పాట ఒకటున్నది. ఆచార్య ఆత్రేయ రాసిన పాట అది.

''వీణలోన తీగలోన
ఎక్కడున్నది నాదము
అది ఎలాగైనది రాగము.'' ఈ పాటను వక్రవాకం రాగంలో సుశీల పాడింది. మహదేవన్ సంగీతం సమకూర్చాడు.

వీణను చేతబూని, వాణిశ్రీ మీటుతుంటే, ఆమెకు ఆ విద్యలో ఎంత ప్రావీణ్యత వున్నదో అర్థమైంది. నటిస్తున్నదేమో అనుకొన్నాను. కానీ



''చక్రవాకం''లో శోభన్, వాణిశ్రీ

ఆమె నిజంగానే వాయించింది. ఆమె వీణా విద్వత్తుకు శోభన్, రంగారావు, అంజలీదేవి పరవశులయ్యారు. ఈ దృశ్యం ప్రశాంతంగా, పరిమళభరితంగా వుండేట్టు విక్టరీ. మధుసూదన రావు చిత్రీకరించారు. ఈ చిత్రానికి మార్కస్ బారట్లే పెద్ద యస్సెట్.

''చక్రవాకం'' లో నాగభూషణం, రామా నాయుడు, పద్మనాభం, రాజబాబు, అల్లురామ లింగయ్య, జి. వరలక్ష్మి, కృష్ణకుమారి, చంద్రకళ, రాజసులోచన ప్రధాన తారాగణం.

## దేవదాసుకు శివాజీ దీవెన

శరత్ నవలను విజయకృష్ణ కంబైన్స్ (సినిమాస్కోప్ కలర్‌లో) జులై యిరవైన వాహినీలో ప్రారంభించారు. దేవదాసుకు ''నడిగర్ తిలగం'' శివాజీ దీవెన లభించింది. స్విచ్ ఆన్‌చేసి జయమగుగాక అని ఆయన ఆశీర్వదించారు. దేవదాసు హేర్‌స్టైయిల్ చాలా చక్కగా కనిపించింది. పరిశ్రమ ప్రముఖు లనేకులు వచ్చి దేవదాసు పాత్ర ధారిని అభినందించారు. నవయుగ శ్రీనివాసరావు, శ్రీఫిలింస్ రామకృష్ణరావు విజయవాడ నుండి ప్రత్యేకంగా వచ్చి పాల్గొన్నారు.

## పార్వతికి సావిత్రి ఆశీస్సు

పార్వతి పాత్రను పోషిస్తున్న విజయనిర్మలకు విజయం చేకూరాలి అని ఆనాటి పార్వతి సావిత్రి మనసారా దీవించింది. క్లాప్ కొట్టింది. దర్శకు రాలిగా పేరు తెచ్చుకోవాలి అంటూ విచ్చేసిన విఖ్యాత దర్శకు లందరూ ఆశీర్వదించారు.

దేవదాసు చిత్రంలో ఎవరు ఏ పాత్రను పోషిస్తున్నారో పాఠకులకు తెలపాలిగా.

దేవదాసు – కృష్ణ; పార్వతి– విజయనిర్మల; చంద్రముఖి – సరోజాదేవి; పార్వతి భర్త–గుమ్మడి; దేవదాసు తండ్రి–జగ్గయ్య; పార్వతి తల్లిగా కృష్ణ కుమారి, తండ్రిగా కాంతారావు, నాయనమ్మగా నిర్మల. భగవాన్ – రాజబాబు; దేవదాసు అన్న – శ్రీధర్; మనోరమ – మణిమాల; బడిపంతులు అల్లురామలింగయ్య.

దేవదాసు చిత్రానికి వి. ఎస్. ఆర్. స్వామి, ఆత్రేయ, రమేష్‌నాయుడు, తోట, గోపాలరావు సాంకేతిక వర్గం.

## సెప్టెంబరు వ్రతం

దేవదాసు పాత్రను పోషించే సమయాన వ్రతం ఆచరించడానికి కృష్ణ నిర్ణయించారట. రాత్రివేళ షూటింగు పెట్టుకొంటారట. ఇరవై రోజులు వరుసగా అదే చిత్రంలో నటిస్తారట. వ్రత భంగం కాకుండా వుండడం కోసం సెప్టెంబరులో మరెవ్వరికీ పని చెయ్యరట.

— శ్రీనివాస్

# బ్రహ్మ-మాయ-జీవాత్మ



ధర్మపథం ✲ బులుసు వేంకటరమణయ్య

లక్ష్మణుడు ఎల్లప్పుడూ రాముణ్ణి చూస్తూ వుండాలనే కోరికతో వుంటాడు. అందువల్లనే వనవాస సమయంలో కూడా రాముని వెంట వచ్చాడు, తన భార్యను కూడా విడిచి పెట్టి.

అడవులలో సంచరించేటప్పుడు రాముడు ముందు నడిచేవాడు. అతని వెనుకనే సీత ఉండేది. ఆమె వెనుక లక్ష్మణుడు వుండేవాడు. అటువంటి సమయంలో లక్ష్మణునికి రాముని రూపు కనబడేది కాదు, సీతాదేవి అడ్డుగా ఉండడంవల్ల. అందుకని అతడు రాముణ్ణి చూడడంకోసం సీతాదేవిని కొంచెం ప్రక్కగా తొలగవలెనని ప్రార్థించవలసి వచ్చేది. ఆమె ప్రక్కకు తప్పుకుంటే లక్ష్మణుడు రాముణ్ణి చూడగలిగేవాడు.

ఆ విధంగానే బ్రహ్మపదార్థానికీ, జీవునికీ మధ్య మాయ స్థానం కల్పించుకుని వున్నది. ఇక్కడ బ్రహ్మను రామునితోనూ, సీతను మాయతోనూ, జీవుణ్ణి లక్ష్మణునితోనూ పోల్చవలసి వున్నది.

జీవుడు బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందాలంటే జీవ, బ్రహ్మలకు మధ్యను అడ్డంగా వుండే **మాయ తొలగిపోవాలి.** అడ్డుగా మాయ ఉన్నంతకాలం జీవునికి బ్రహ్మ సాక్షాత్కారం కలగనే కలగదు.

మనం ఒక నాట్యాన్ని కాని, నాటకాన్ని కాని చూడడానికి వెళ్లామనుకుందాం. రంగస్థలం మీద తెర అడ్డంగా వుంటుంది. ఆ తెరకు లోపలనే నటకులు, నట్టువలు, నాట్యకత్తెలు వుంటారు. తెరను ఎత్తితేగాని వారిని చూడడం సంభవించదు.

ఇక్కడ ప్రేక్షకుడు జీవునివంటివాడు. నటులు మున్నగువారిని బ్రహ్మతో పోల్చవచ్చును. రంగస్థలం పైని ఉన్న తెరయే మాయ అనుకోవచ్చు.

ఈ విధంగా ప్రతిబంధకంగా వున్న మాయ తొలగిపోతేనే కాని, జీవునికి బ్రహ్మ స్వరూపం గోచరం కాదు.

ఆవరణరూపమైన మాయను తొలగించడానికే జీవుడు సర్వదా ప్రయత్నించ వలసి వుంటుంది. ●

## అన్నపూర్ణ

(22వ పేజీ తరువాయి)

"ఈ కొత్త ప్రవాహం అటువంటిది **పూర్ణా!** ఎవ్వరి జీవితాన్ని వాళ్లు సరిదిద్దుకునే శక్తి, తెలివి వున్నప్పుడు, రావువంటి వాళ్లెవ్వరు ఆ ప్రవాహాన్ని ఆపలేరు. ఆపాలనుకోవటం అవివేకం; కులం, సాంప్రదాయం అంటూ మడ్డిలా పేరుకున్నవాటి నన్నిటిని సైతం అట్టడుగునుండి తుడిచిపెట్టుకు పోతున్న ఈ ప్రవాహాన్ని ఆపలేక ఎన్నడో ఒకనాడు ఓటమి నంగీకరించక తప్పదు.

నువ్వు సాధించలేనిది ... భాను సాధిస్తుందనే నా నమ్మకం. రావుకు వయసు పెరిగింది. ఈ సమయంలో ఆయన ఓటమి నంగీకరించకున్నా, బంధాలకున్న శక్తి అయినా, ఆయనలోని ఆవేశాన్ని, మొండితనాన్ని ఓడించి... నీ దగ్గరికి తెస్తుందేమొ! కూతుళ్లకు ఏం కాకపోయినా ... నీకు అన్నయ్యగా మిగిలాడుకదూ!" అని అంటున్న పురుషోత్తమ రావు మాటలకు ఎదురుగా లేని రావు గురించి ఆలోచిస్తూ "నేనున్నాను అన్నయ్యా! పూర్ణను" అనుకుంది అన్నపూర్ణ కళ్లనీళ్లు దాచుకుంటూ.

### 25

"భానూ!" కర్కశంగా పలికింది రావు గొంతు.

భాను భయపడలేదు. ధైర్యంగా తలెత్తి, సూటిగా తండ్రి మొహంలోకి చూసింది.

'చంద్రం చాలా మంచివాడు నాన్నా! చదువు, సంస్కారం గల వ్యక్తి."

"కాని... అతనికి ఓ మతం అంటూ ఏడ్చిందా? కిరస్తాని తల్లి... తండ్రి హిందువు. కులం సాంప్రదాయం ఏమైనా వున్నాయా? ఏం చూసి పెళ్లి చేసుకుంటావ్?" రావు ప్రశ్నకు భాను నవ్వింది.

"కులం, సాంప్రదాయం అంటూ, అక్కయ్య మెడలు వంచి బలవంతంగా పెళ్లి చేసావ్! కేవలం నీ కూతు రనిపించుకోవాలనే తాపత్రయం తప్ప అక్కయ్య యిష్టాన్ని గ్రహించావా నాన్నా? అర్థం చేసుకోవడానికి ప్రయత్నించావా? కనీసం అక్కయ్య కాపురం ఎలా వుందో అర్థం చేసుకున్నావా? ఆ యింట్లో అందరికి సేవలు చేస్తూ అవసరాలను తీర్చే మనిషిగా తప్ప, మమత, అభిమానాలకు మొహం వాచిపోయి, అనుమానించే భర్త ప్రతి క్షణం అవమానిస్తుంటె అభిమానాన్ని చంపుకొని, జీవచ్ఛవంలా బ్రతుకుతోంది? ఎందుకో తెలుసా నాన్నా! నిజం నీతో చెబితే లాభ మేమిటీ? భర్తను వొదిలేసి ఒంటరిగా నీ దగ్గరి కొచ్చినా పరువు ప్రతిష్ట అంటూ అక్కయ్యను తిరిగి తరిమేస్తావ్! అందుకే... అక్కడే ప్రతి క్షణం చావు కెదురు చూస్తూ బ్రతుకుతోంది. చివరికి నీ యిష్టప్రకారమే రావు కూతురుగా మిగిలిపోవడానికి, జీవితాన్ని నరకం చేసుకుంది."

"లేనిపోని భయాలతో, భవిష్యాన్ని నరకంగా ఊహించుకొని, కోరుకున్న మనిషికి యిచ్చిన మాట సైతం మరచి, నువ్వు ఏరికోరి తెచ్చినవాణ్ణి చేసుకొని, తనను తాను వంచించుకుంటూ, కట్టుకున్న భర్తను అభిమానించలేక, ఆ యింటి కోడలిగా తప్ప ఆ యింటికి మరేం కాకుండా పోయింది రుక్మిణి! ఎందుకో తెలుసా నాన్నా! ఈ కులం, సాంప్రదాయం లేకుంటే మనిషి మనుగడ నరకం అయిపోతుందని, నీ కూతుళ్ళనిపించుకోవాలనె స్వార్థంతో నువ్వు పెద్దక్కయ్యను శాసించడం విన్న రుక్మిణి... నీ మాటకు తల వంచి ఈనాడు తనకు తానె ఏం కాకుండా మిగిలిపోయింది."

"పెద్దక్కయ్యలా అనుమానాలు, అవమానాలు భరించలేక, జీవితంతో రాజీ పడలేక, చిన్నక్కయ్యలా వంచన జీవితం గడపలేక, రాధక్క జీవితంలో నుండే పారిపోయింది. అత్తయ్యలా వాళ్ళకు ధైర్యం లేదు. మమతను పంచలేని, మనసును పెంచలేని ఈ కులం సాంప్రదాయం... అక్కయ్యలను నీ కూతుళ్ళుగా మాత్రం మిగల్చగలిగాయి. మమ్మల్నందర్ని నీ కూతుళ్ళుగా మిగుల్చుకోవాలనె నీ స్వార్థం చివరికి... నిన్ను మాత్రం మా నాన్నగా మిగల్చలేకపోయింది. నేను... నీ కూతురుగా మిగలా లనుకోవడం లేదు. నేను... అత్తయ్య కోడలని. అన్నపూర్ణ కోడలిగానే మిగిలిపోతాను నాన్నా!"

"భానూ!" విసురుగా చెయ్యెత్తాడు రావు. కాని అతని చేయి ఆగిపోయింది. గుమ్మంలో ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం ... నిశ్చలంగా నిలబడి చూస్తున్నాడు చంద్రం.

"నాన్నా! తండ్రిగా నీ యిష్టాలను, నీ అభిప్రాయాలను మేము గ్రహించాలనుకున్నావే తప్ప, మా యిష్టాలకు, అభిప్రాయాలకు ఏనాడు విలువ యివ్వలేదు. తండ్రిగా మమ్మల్ని శాసించే అధికారంతో పాటు, మమ్మల్ని అర్థంచేసుకునే బాధ్యత కూడా నీదే నాన్నా! నీ అభిప్రాయాన్ని ఖండించే అధికారం నాకు లేదు. నీ యిష్టాలను శాసనాలుగా మార్చి మా జీవితాలను బలిపెట్టి తండ్రిగా మిగిలిపోని స్థితి వచ్చినపుడు, నువ్వు గొప్పవి అనుకుంటున్నవేవి, మనిషి మనుగడకు అవసరమనిపించుకుంటున్నవేవి, నిన్ను మా దగ్గరికి తేలేవు నాన్నా! నీ అభిప్రాయాలు, కులం సాంప్రదాయం, పరువు ప్రతిష్ట, వాటిమీద వీకుండే అభిమానం మమ్మల్ని అర్థం చేసుకోనీయలేదు. మమ్మల్ని అర్థంచేసుకునే సహృదయత, కాలాన్ని, మారుతోన్న ప్రవాహం లాంటి కాలాన్ని అర్థంచేసుకునే ఓర్పు నీకుంటే ఈనాడు మేము రావు కూతుళ్లగానే కాదు, నువ్వు మా తండ్రిగా మిగులుతావ్ నాన్నా!" అంది భాను.

భాను – ముగ్గురిలో మరుగుపడ్డ ధైర్యానికి ప్రతిబింబం.

# సింథాల్ ఇచ్చే సౌగ్దానం...

* నిత్య నూతన సౌరభం

* సంపూర్ణ లావణ్య పోషణ

* సార్థక దుర్గంధ నివార్య రక్షణ




## ...నిలబెట్టుకో కలిగింది సింథాల్ ఒక్కటే.

Interpub/GSC/11/74

చంద్రంతో ముందుకు కదిలింది భాను.
రావు భాను వంక చూసాడు.
భానులో అన్నపూర్ణ నిండివుంది.
భాను మాటల్లో అన్నపూర్ణ ధ్వనించింది.
భాను మోహంలో అన్నపూర్ణ నవ్వింది.

భాను చేతిని తన చేతిలో ఋముడ్చుకొని గర్వంగా వెళ్ళిపోతున్నాడు చంద్రం. ఆ మునిమాపు వేళ, లేత నీరెండలో, ఒకరి ప్రక్కనే మరొకరు, తోడునీడగా, ధైర్యంగా కదలి పోతున్న ఆ జంట వంక చూస్తూ, నిశబ్దంగా నిలబడిపోయాడు రావు. ఎదురుగా కన్పిస్తున్న సందు మలుపు తిరిగే సమయానికి, రావు గుండె నెవరో పిండేసినట్టు కావడంతో, 'ఒక్కసారి భాను తిరిగిచూస్తే!' అనుకున్నాడు. కాని .. ముందుకువేస్తున్న ప్రతి అడుగు వెనక్కి వెళ్ళిపోయిన దారిని మరిపిస్తూవుంటే, వెనక్కితిరిగి చూడకుండా, చంద్రం చేతిని బిగించి పట్టుకొని వెళ్ళిపోయింది భాను.

బోసిపోయి యింట్లో ఒంటరిగా మిగిలిన రావుకు ఇద్దరు కూతుళ్లు కళ్లలో కదిలారు "భాను చెప్పిందంతా ... నిజమేనా ? తను తప్పు చేసాడా ?"

భాను మాటలను జ్ఞాపకానికి తెచ్చుకుంటూ ఆలోచిస్తున్న రావు, కళ్ళ ముందు సన్నటి తెర కరిగిపోసాగింది. తను చేసిన మూర్ఖపు పట్టుదలకు లొంగిపోయిన సత్య, రుక్మిణి... వాళ్ళకు తను తండ్రిగా మిగల్లేదన్న నిజం, భాను మాటల ద్వారా స్పష్టంగా అర్థం చేసుకున్న రావు, వాళ్ళు తన కూతుళ్ళుగా మిగిలినా, తను వాళ్ళకు తండ్రిని కాలేక పోయానన్న సత్యం మనసును క్రుంగదీసింది.

తండ్రిగా తన మాటను వాళ్ళు శాసనంగా తలచి చేయాలనుకున్నాడే తప్ప, వాళ్ళ మనసులోని కోరికకు, ఇష్టానికి విలువ ఇవ్వలేదు ఫలితంగా... వాళ్ళ జీవితాలు... అవమానాలు, అనుమానాల, వంచనల పాలైపోయాయి

ఒకనాడు తాను గొప్పగా అనుకున్న విషయాలు, ఈనాడు రావుకు చాలా వెగటుగా, వెర్రిగా అన్పించసాగాయి

రాత్రిళ్ళు పన్నెండు వరకు ,కళ్ళలో వొత్తులు వేసుకొని, భోజనం చేయకుండ భర్త కోసం ఎదురు చూసే సత్యను, అల్లుడికి ఆఫీసులో పనెక్కువగా వుందేమో అనుకున్నాడే తప్ప మరో విధంగా ఆలోచించలేదు. ప్రొద్దస్తమానం వెట్టి చాకిరితో క్షణం తీరిక లేక, తనతో మాట్లాడడానికి కూడా అవకాశం లేకుండా, విశ్రాంతి లేని సత్య జీవితాన్ని చూసి "యింటి పెద్ద కోడలు... బాధ్యత బరువు" అని అనుకున్నాడే తప్ప తన కూతురు ఆ యింట్లో అందరికీ చాకిరి చేసే మనిషిగా మిగిలిందని మాత్రం ఊహించలేకపోయాడు సత్య తడి ఆరని కళ్ళలో, ఎంత బాధ గూడు కట్టుకొని వుందో అర్థం చేసుకోక, 'వెర్రితల్లి! తన మీద బెంగ పడిపోతుందను" కున్నాడే తప్ప...

ప్చ్ .. రుక్మిణి మూగతనం, గోపాలం ముభావం చూసి, తనముందు మాట్లాడుకోవడానికి సిగ్గు పడుతున్నారని, అనుకొని, వాళ్ళు తనకేదో గౌరవం యిస్తున్నారని పొంగిపోయాడే తప్ప, రుక్మిణి

# అన్నపూర్ణ

తనను తానే కాక, తండ్రినైన తనను వంచిస్తుందని అనుకోలేదు

చివరికి... తన మూర్ఖపు పట్టుదల విషయం తెలిసి రాధ తనను శాశ్వతంగా విడిచి వెళ్ళిపోయింది. ఈనాడు భాను . భాను యిష్టాన్ని కాదన్నందుకు భాను తనకు దూరంగా చంద్రంతో వెళ్ళిపోయింది.

ఆనాడు అన్నపూర్ణను, ఈనాడు భానును తరిమేసి, వాళ్ళకేమీ కాకుండాపోయాడు తన యిష్టానికి లొంగిన మిగతా ముగ్గురికి కూడా తానేం కాకుండాపోయాడు. ఈనాడు తనకు ఎవ్వరూ మిగల్లేదు. ఎవరున్నారు తనకు ? కాని... తన మూర్ఖత్వాన్ని ఎదిరించిన అన్నపూర్ణ హాయిగా కాపురం చేసుకుంటోంది. బహుశా భాను సుఖంగా వుంటుంది. కాని. . సత్య, రుక్మిణి జీవితాలను తానేం బాగుచేయలేడు చివరికి వాళ్ళకు తానేం చేయలేని నిస్సహాయుడైపోయాడు.

అలవాటైన ఒంటరితనం ఆ క్షణంలో రావుకు అతి భయంకరంగా మారిపోయింది. ఆవ

**త్వరలో**
**పుత్తడి బొమ్మ**
**సీరియల్ ప్రారంభం**

రించుకున్న నిశబ్దం భయం పెంచడంతో తన మూర్ఖత్వం, తనమీద సాధించిన విజయాన్ని వికటాట్టహాసం చేస్తూ తనను వెక్కిరించడంతో రావు పట్టుదల, మొండితనం, ఓడిపోసాగాయి.

ప్రతిరోజు రాత్రిళ్ళ వరండాలో మంచంమీద పడుకున్న రావుకు యింటిముందు మరింత చీకటిని పెంచిన చింతచెట్టు పెద్ద రాక్షసిలా కన్పించేది. ఆకాశంవంక చూస్తే, మినుకు మినుకు మంటున్న చుక్కల్లో నుండి రాధ కన్పించేది. "రాధక్క చుక్కగా మారిపోయింది నాన్నా !" అన్న భాను మాటలు గుర్తుకొచ్చేవి. ప్రతిక్షణం కళ్లముందు, తను ఆలోచించే ప్రతి ఆలోచనలో భాను నిండిపోయేది.

ఆరు నెలలు గడిచిపోయాయి. రావులోని పట్టుదల మొండితనం పూర్తిగా ఓడిపోయాయి. కాని, అతనిలోని ఆత్మాభిమానం మాత్రం అతణ్ణి ముందుకు కదలనీయలేదు. ఒకటి రెండుసార్లు, మనసు సత్యను చూడాలని, రుక్మిణిని చూడాలని పీకినా భాను మాటలు గుర్తుకొచ్చేవి. "కేవలం నువ్వు తండ్రివన్న అభిమానంతో తప్ప, ప్రేమగా కష్టసుఖాలు విని విచారించే కన్నతండ్రిగా మిగలలేక పోయావ్ నాన్నా! వాళ్ళు ఏనాడు నీకు వాళ్ల బాధలు చెప్పకోరు. ఎందుకో తెలుసా ? మలుపు తిరిగినవాళ్ల జీవితాలు ... మరో మలుపు తిరిగితే... నువ్వు భరించలేవు. నీకోసమే నాన్నా! కేవలం నీ కూతుళ్ళుగా మిగిలారు." అన్న ఆ మాటలు చెవుల్లో మారుమ్రోగిపోవడంతో బయలుదేరిన రావు, నిస్సత్తువుగా మంచంమీద కూలబడిపోయాడు.

భాను వెళ్లిపోయిందన్న విషయం తెలిసి సత్య కాని, రుక్మిణి కాని రాలేదు. కనీసం ఉత్తరంలో కూడా తండ్రిని ఓదారుస్తున్నట్టు రాయలేదు. "భాను అత్తయ్య కోడలు నాన్నా! అత్తయ్య కోడలుగానే మిగిలిపోయింది." అంటూ రాసిన వాళ్ల ఉత్తరాలు చూసి, రావుకు కళ్ల ముందున్న తెర తొలగిపోయింది. అతని ఒంటరితనానికి తోడుగా వుంటారేమోనని సత్యను రమ్మని వ్రాస్తే రానంటూ స్పష్టంగా రాసింది. రుక్మిణి ఆ ప్రశ్నకు జవాబే యివ్వలేదు.

రోజులు గడిచేకొద్దీ, కఠదుగట్టిన రావు గుండె కరిగిపోసాగింది. ఒంటరితనం అవహేళన చేస్తుంటే అతనికి భార్య గుర్తుకువచ్చింది. "లక్ష్మీ నువ్వున్నా ... ఈ క్షణంలో నాకీ బాధ వుండేది కాదు" అంటూ బాధపడిపోయాడు నలుగురు ఆడపిల్లలను కన్న రావు.

నలుగురి ఆడపిల్లల తండ్రి – వెర్రిగా నవ్వుకున్న రావుకు అన్నపూర్ణ ఒకనాడు అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

"అన్నయ్యా! ఆడపిల్లల తండ్రిగా ఒక్క మాట గుర్తుంచుకో! తండ్రిగా నీ అభిప్రాయాలను శాసనాలుగా మార్చి వాళ్ళు నీ కూతుళ్ళుగా మిగలాలన్న స్వార్థంతో, చివరికి నువ్వు వాళ్ళకు తండ్రిగా మిగలకుండా ఒంటరిగా మిగిలిపోతావ్. వాళ్ళు నీకు కూతుళ్ళుగా మిగలకున్నా, నువ్వు వాళ్ళకు తండ్రిగా మిగలడానికి ప్రయత్నించు నాన్నా ! రావు కూతుళ్ళుమనే కాక, "రావు మా నాన్న" అని గర్వంగా వాళ్ళు చెప్పుకోవాలి. నీ పిల్లలు నీ పట్ల భక్తి గౌరవాలు కాదు, ప్రేమ, అభిమానం పంచేలా తప్ప ద్వేషాన్ని పెంచుకునేలా ప్రవర్తించకు. ఆ స్థితే వస్తే, నిజం గ్రహించిన నీకు నీమీదే అసహ్యం వేసి, క్షమించుకోలేని స్థితి వస్తుంది. నీ ఒంటరితనం నిన్ను భయపెడుతుంది."

అర్ధరాత్రి దాటిపోయింది.

రావు పూర్తిగా ఓడిపోయాడు. ఒక్క క్షణం యింట్లో నిలబడలేక పోయాడు. యిల్లు విడిచి బయలుదేరిన అతనికి, దారి స్పష్టంగా కన్పిస్తోందె తప్ప గమ్యం తెలీడంలేదు. తన కెవరున్నారూ ? తను ఎవ్వరికి ఏం కాలేకపోయాడు

"నాన్నా ! అత్తయ్యను ఆనాడు తరిమేసినా... ఈనాటికి అన్నయ్యగా మిగిలావ్ ! ఈనాడు నన్ను నీ మాట విననందుకు, నీ ముందు తల వాల్చనందుకు, నన్ను తరిమేస్తున్నావ్ !... అయినా నాన్నా ! నా బ్రతుకు నన్ను బ్రతకడానికి అవకాశం యిచ్చిన నువ్వు... ఏనాటికైనా నాకు నాన్నగా మిగులుతావ్." భాను మాటలు గుర్తుకొచ్చాయి.

ఒంటరితనం భయపెడుతూ, తరిమేస్తుంటే, ఆ చీకటి నిలదీసి "ఎక్కడికి రావూ ప్రయాణం?" అంటూ అడిగినట్టనిపించింది.

"భాను దగ్గరికి" అని అనలేకపోయాడు. మిగతా యిద్దరి దగ్గరికి తాను వెళ్ళలేడు...మరి !?

అతని గుండె లోతుల్లోనుండి, అస్పష్టంగా... రాను రాను స్పష్టమై ఆ చీకటికి, భయపెడుతున్న ఒంటరితనానికి వినిపించేలా గట్టిగా, "నా చెల్లి దగ్గరికి... అన్నపూర్ణ దగ్గరికి" అన్న జవాబు వినవచ్చింది. ఆ క్షణంలో అతని మనసులో ఓడిపోయానన్న బాధ, దిగులు లేవు. మనసెంతో తేలికై ఏదో తెలియని తృప్తితో నిండిపోయింది. ఆ తృప్తి వెనుక... ఎవరిదో చల్లని చూపు.

**[అయిపోయింది]**

# డాక్టర్ సలహాలు

డా. కె. వెంకటేశ్వరరావు

**కె. ఆర్. నందిగామ.**

మధ్యాహ్నం భోజనం తర్వాత నిద్రపోవటం, మంచిదేనా ? ఉదయంపూట కాఫీ తాగితే మంచిదా— భోజనం చేస్తే మంచిదా ?

మీరేదో ఆరోగ్య సూత్రాలను నాచేత వల్లె వేయించ చూస్తున్నట్లుంది. ఆహారం తీసుకున్న వెంటనే కొంచెమైనా వ్యాయామం (అంటే కొంచెం దూరం నడవటం) అవసరం. 1 గంట అయిన తర్వాత నిద్రపోయినా, ఏంచేసినా పర్వాలేదు.

ఉదయంపూట కాఫీకి బదులుగా, ఆకాఫీకి ఉపయోగించే పాలే, పాలుగా పుచ్చుకొని, 3 గంటల తర్వాత భోజనం చేస్తే మంచిది. కాఫీ ఆకలిని చంపుతుంది

**వి. ఆర్. గోపాలపురం.**

మా అమ్మాయి వయస్సు 2 సం. లు పుట్టినప్పుడే వీపుపై వెన్నెముకమీద 6 అంగుళముపొడవులో వెంట్రుకలు ఉన్నవి. అమ్మాయి ఆరోగ్యముగానే ఉంటుంది. ఇలా ఎందువల్ల జరుగుతుంది ?

పుట్టుకతోనే వచ్చే కొన్ని శరీర మార్పులలో ఇది ఒకటి. దీనివల్ల ఏమీ ప్రమాదములేదు. ఆ వెంట్రుకల క్రింద ఉన్న చర్మము నల్లగా కమిలినట్లు ఉంటుంది. అవి కనపడని ప్రదేశములో ఉన్నాయి కనుక ప్రత్యేకించి వైద్యము చేయనవసరములేదు. వేరే ప్రదేశములలో ఇలా రావు. అంతగా వైద్యం చేయించవలసివస్తే ఎక్స్‌రే కిరణాలను ఆచోట ప్రసరించచేయుటంవలన వెంట్రుకలు తిరిగి రాకుండా చేయవచ్చును.

**బి. ఎమ్. రాజమండ్రి.**

నిమ్మరసం, ఆముదం కలిపి తలకిరాయడం వలన జుట్టువెత్తుగా ఉండి, దువ్వినతల దువ్వినట్లే ఉంటున్నది. ఇలా చేయడంవలన జుట్టు వూడటం కానీ, వేరే ఏదన్నా ప్రమాదం కానీ ఏమన్నా ఉన్నదా?

తలకు ఆముదం రాయడంవల్ల వెంట్రుకలు చాలా ఆరోగ్యముగా ఉంటాయి. వెంట్రుకల కుదుళ్లకు అవసరమయిన "ఎమైనో" ఆసిడ్స్ ఇందులో ఎక్కువగా ఉన్నాయి. నిమ్మరసం కూడా కలిపిరాయడంవల్ల వెంట్రుకల కుదుళ్లకు విటమిన్ "సి" లభ్యమవుతుంది. అయితే వాడే ఆముదం కల్తీలేనిదిగా చూసుకోవడం చాలా ముఖ్యము.

**ఎం. ఎస్. హెచ్. నిజామాబాద్.**

నా వయస్సు 20 సం.లు వివాహమయింది కొన్ని నెలల క్రితం ఇంకొకరితో కలిసాను. అప్పటినుండి నామూత్రనాళమంటుంది, చీము రక్తము వస్తుంది. అక్కడక్కడ చిన్న కురుపులు వున్నవి.

పెళ్ళయి కూడా ఏమిటీ బుద్ధి ? రోగ లక్షణాలు సుఖరోగ లక్షణం అని వేరేచెప్పాలా ? డాక్టర్, లేక పి. ఎ. ఎం. ఇంజక్షన్లు ప్రతిరోజూ 15 లక్షల యూనిట్లు రెండువారాలపాటు వేయించుకోవాలి. దీనికోపాటుగా 'వాస్టిసిన్' టాబ్లెట్లు రోజుకి రెండు చొప్పున ఒకవారం వేసుకొంటే తొందరగా తగ్గుతాయి.

# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

## 1974 దీపావళి కథల పోటీ — బ్యాలట్ !

**నాలుగు కథలు : మొత్తం రూ. 5000 ల బహుమతులు !**

ఏటా నిర్వహిస్తున్నట్లే యీ ఏడాది కూడా ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచిక ప్రత్యేక ఆకర్షణగా 'కథల' పోటీ నిర్వహిస్తున్నాము.

ఐతే యీసారి "కథల" సంఖ్య తగ్గించి బహుమతుల మొత్తాన్ని పెంచాము. పోటీకి వచ్చిన కథలలో 'సంపాదకుని ఎన్నికలో' అత్యుత్తమంగా తేలిన **నాలుగు** కథలకు ఒక్కొక్క కథకి రు. **750** చొప్పున పారితోషికం అందజేస్తాము. ఇదిగాక యీ నాలుగు కథలను ప్రచురించి వాటిపై పాఠకుల అభిప్రాయాన్ని బ్యాలట్ పత్ర రూపంలో తీసుకోదలచాము.

**ముగింపు తేదీ : 20-9-1974**

బ్యాలట్‌లో ప్రథమ స్థానాన్ని పొందిన కథకు అదనపు బహుమతి రు. *650* యిస్తాము. ద్వితీయ స్థానం, తృతీయ స్థానం పొందిన కథలకు ఆ క్రమంలో రు. *550*, రు. *450* లను అదనపు బహుమతులుగా పంపుతాము. చివరి కథకు రు *350* లు అదనపు బహుమతిగా పంపుతాము. అంటే దీపావళి కథలు నాలుగింటికి రు. *1400*లు, రు. *1300*లు, రు. *1200*లు, రు. *1100* లు ఆ వరుసలో బహుమతులు అందుతాయన్నమాట.

### * నిబంధనలు *

- ★ సంపాదకుని ఎన్నికలో నెగ్గిన నాలుగు కథలను దీపావళి సంచిక; ఆ తరువాతి సంచికలలో అప్పటి వీలును బట్టి ప్రచురిస్తాము. ఈసారి విజేతల పేర్లు, వివరాలుకూడా బ్యాలట్ ఫలితాలతో పాటే ప్రకటించాలని నిర్ణయించాము ముందుగా కథలతో పాటు ప్రకటించము. కథల ఎన్నికలో పాఠకుల సౌలభ్యంకోసం యీ మార్పు చేస్తున్నాము.
- ★ రచన తెలుగువారి సామాజిక జీవితానికి సంబంధించినది అయి వుండాలి. లేటతెలుగు వ్యావహారిక భాషలోనే వ్రాయడం అవసరం.
- ★ రచన 12 అరఠావులకు మించరాదు. లోగడ అచ్చులయిన, ప్రసారమైన కథలను పంపరాదు అనువాదం, అనుకరణ కారాదు. ఈ మేరకు రచయిత హామీ పత్రం కథతోపాటే జతపరచి మరీ పంపితీరాలి. రచనలపై పేచీలు వస్తే బాధ్యత రచయితలదేనన్న మాట గుర్తుంచుకోవాలి
- ★ 1974 దీపావళి కథలపోటీ : సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3. అన్న చిరునామా కవరుపై స్పష్టంగా వ్రాయాలి.
- ★ పోటీలో నెగ్గిన కథల రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు మొదలైన వాటి ప్రచురణకు అంగీకరించాలి. తమ ఫొటో, వివరాలు పత్రికలో పడటం యిష్టంలేని రచయితలు పోటీకి కథలు పంపకపోవటం మంచిది.
- ★ దీపావళి పోటీకి వచ్చిన రచనలు త్రిప్పి పంపలేము. కనుక స్టాంపులు, స్వంత కవర్లు మొదలైనవి కథలతోపాటు పెట్టకూడదు.
- ★ పోటీకి వచ్చిన కొన్ని కథలను వాటి స్థాయిని బట్టి మామూలు ప్రచురణకు స్వీకరించే అవకాశముంది. ఆ విధంగా ఎన్నికయిన కథకులకు ఆ విషయం దీపావళి తరువాత నాలుగు వారాలలోగా తెలియ జేయటానికి ప్రయత్నిస్తాము.

—సం.

# ఇల్లాలి నిర్ణయం

ముద్దంశెట్టి హనుమంతరావు

**శేఖర్ ట్రేలోవున్న కేసులు ఒక్కొక్కటీ తీసి సంతకాలు పెడుతున్నాడు. మధ్యమధ్యా టెలిఫోను మోగినప్పుడంతా మాట్లాడుతున్నాడు. సిగరెట్లు ఒకదాని వెంట మరోటి పీల్చేస్తున్నాడు.**

ట్రేలో మేటలా పడున్న కేసులు, ఆరోజు యెట్లాగైనా సంతకాలు పెట్టేయ్యాలన్న దీక్ష, పట్టుదల,అతని ప్రతికదలికలోనూ అగుపిస్తున్నయ్.

స్ప్రింగ్ డోర్స్ తోసుకొని, శ్రీధర్ అప్పుడే వచ్చాడు.

"గుడ్ మార్నింగ్ శేఖర్..."

"గుడ్ మార్నింగ్... రావోయ్... రా... కూచో..." ఆహ్వానిస్తూనే సంతకాలు పెడుతున్నాడు, శేఖర్.

శ్రీధర్, శేఖర్కి అభిముఖంగా కూచున్నాడు.

"ఏవిఁటీ? అంత దీక్షగా వన్జేస్తున్నావివ్వాళ? సాయంత్రం యెక్కడికైనా ప్రోగ్రామ్ వుందా?"అడిగాడు శ్రీధర్.

శేఖర్ కలాన్ని స్టాండు మీద పెట్టేసి, చిన్న నవ్వు నవ్వి, సిగరెట్ దమ్ము గట్టిగా లాగాడు.

"అబ్బే! ప్రోగ్రామ్ యేఁవీఁ లేదనుకో! రెండ్రోజులు క్యాంపుకెళ్లి వచ్చేసరికి, పాపంలా పెరిగిపోయాయి కేసులు. టేబిలు మీద కేసులు పడుంటే, నాకు మాత్రం యేదో పెద్దభారం గుండెల మీదున్నట్టే వుంటుంది. వాటిని యెంత త్వరగా డిస్పోజ్ చేస్తే, అంత హాయనిపిస్తుంది. అందుకనే ఓపిగ్గా కూచున్నా!"అన్నాడు శేఖర్:

శ్రీధర్ మందహాసం చేశాడు. "గుడ్ హేబిట్... నీ అంత ఓపిగ్గా నేను కూచోలేను సుమా! ఔనూ, యీ మధ్య నువ్వు నాటకాల పిచ్చిలో పడ్డావని విన్నాను. నిజమేనా?" ప్రశ్నించాడు శ్రీధర్.

యీ ప్రశ్న వెయ్యాలన్న ప్రయత్నం నాలుగు రోజుల్నించి చేస్తున్నాడు శ్రీధర్. కాని, యీ రోజుకి వీలు చిక్కింది.

శేఖర్, ముసిముసి నవ్వేడు మరి కాల్చడానికి వీలుగా లేని సిగరెట ముక్కని ఆష్ ట్రేలో పడేస్తూ అన్నాడు.

"అబ్బే! నాటకాలంటె, నాకేం పిచ్చి లేదోయ్. నిజం చెప్పాలంటే, నాటకాలు చూడ్డం కూడా అలవాటు లేదు నాకు. మా ఆవిడకిమాత్రం మొదట్నుంచీ నాటకాలంటే, వెర్రి నాటకాల గురించి మాట్లాడ్డమన్నా, నాటకాలు వెయ్యడమన్నా, అమెకి యెంతో సరదా. ఆమె వుత్సాహానికి అడ్డు తగల్డం యిష్టంలేక, ప్రోత్సహిస్తూ వుంటాన్నేను, ఈ మధ్యనే యేదో నాటకం ప్రారంభించి, రిహార్సిల్సు వేస్తున్నారు"

శ్రీధర్ ఓ నిట్టూర్పు విడిచాడు. "ఐసీ... వాళ్లేదో నాటకం వేస్తున్నట్టు విన్నాన్లే. అయితే, అందులో నువ్వు వెయ్యడం లేదన్న మాట..."

శేఖర్ ఫకాల్న నవ్వేడు, "మంచివాడివే! నేను నాటకాలు వెయ్యడమేవిఁటి? నే నేగనుక నాటకాలు వెయ్యడం ప్రారంభిస్తే, వాటిని చూసేవాళ్లుండరేమో!" పరిహాస ధోరణిలో అన్నాడు.

"అన్నట్టు, ఆ నరహరి నిర్వహణలో వేస్తున్నారటగా?" మళ్లీ ప్రశ్న శ్రీధర్నించి.

"ఔనోయ్. ఆయనే స్వయంగా వచ్చి, నాటకంలో మా ఆవిణ్ణి వేషం వెయ్యమని కోరితే, ఆమె కాదనలేకపోయింది. రోజూ ఆయనే కారులో మా ఆవిణ్ణి తీసుకు వెళ్తా



వుంటాడు. నాటకాలు వేయించడమంటే, యేమిటో ఆయనకి అంతసరదా?'' మామూలు ధోరణిలో అన్నాడు, శేఖర్.

శ్రీధర్, శేఖర్ మొహంలోకి పరిశీలనగా యెందుకో చూశాడు. ఆమొహంలో అమాయకత్వం, కొట్టొచ్చినట్టు కనిపించింది. తన మనస్సులోని మాట చెప్పడమా, మానడమా, అని తటపటాయించాడు తృటికాలం. అయితే, చెప్పాలన్న నిర్ణయానికే వచ్చాడు. "నీతో ఓ విషయం చెప్పాలనుంది శేఖర్ ... కోపగించుకోవు కదా?'' చనువుగా అన్నాడు. వాళ్లిద్దరికీ సన్నిహిత స్నేహం వుందిగాబట్టి, అలా అనగలిగాడు శ్రీధర్. "నాకు కోపం తెప్పించే విషయం నువ్వేం చెబుతావు లేవోయ్...ఫరవాలేదు...చెప్పు...''

"నాటకకళపట్ల అభిమానంవుండొచ్చు... ఆసక్తి వుండొచ్చు... నాటకాలు వెయ్యాలన్న వుత్సాహం వుండొచ్చు. కాని, నరహరి లాంటి వ్యక్తి ఆధ్వర్యంలో నాటకాలు వెయ్యడం, మనవంటివాళ్లం ప్రోత్సహించ కూడదు''తను చెప్పదల్చుకున్నది టకటకా చెప్పేశాడు,శ్రీధర్.

శేఖర్, శ్రీధర్ మొహంలోకి వింతగా, ఆసక్తితో చూశాడు.

"అంటే. నీవుద్దేశం నాకు బోధపడలేదు'' అన్నాడు.

శేఖర్ అమాయకత్వం, అర్థమై పోయింది శ్రీధర్‌కి. నరహరి గురించిన వివరాలేవీ అతనికి తెలీవని తేటతెల్లమై పోయింది.

"అంటె, నీకు నరహరి గురించి యేమీ తెలీదా?''

"నాకు తెలిసిందంతా ఒక్కటే! ఆయనకి లలితకళల పట్ల యెంతో ఆసక్తి. అభిమానం వున్నాయని, వాటి ఔన్నత్యం కోసం ఆయన ప్రాకులాడుతూ వుంటారనీ తెలుసు. ముఖ్యంగా నాటకాలంటే చెవికోసుకుంటారని తెలును... నలుగురూ అనేదికూడా అదే.''

శ్రీధర్ నవ్వేడు.

"లలిత కళల ఔన్నత్యం కోసం నరహరి ప్రాకులాడ్డం యేమిటీ? నా బొంద...అదంతా వట్టి బూటకం. మేకతోలు కప్పుకున్న తోడేలు జీవితం అతనిది. కళారాధన పేరిట, అవినీతి పనులు చెయ్యడంలో అతనిది అందెవేసిన చెయ్యి. అతని గురించి వూళ్లో కొందరికి బాగా తెలుసు. మిగిలిన కొందరూ నీ లాంటి భావనలోనే వుండి, అతనికి బ్రహ్మరథం పడతారు. నువ్వూగాన్నీ మీ ఆవిడగాన్నీ, అతని నిజస్వరూపాన్ని వూహించకపోవడం దురదృష్టకరం. నిజానికి, అతనంటే నాకేం ద్వేషం లేదు. అసూయ అంతకంటే లేదు అయితే, మొన్నను క్లబ్బులో యీ టాపిక్ వచ్చేసరికి, నేనే ఆశ్చర్యపోయాను. అందుకే, నేరుగా నీ దగ్గరికొచ్చి చెప్పాను. నన్ను అపార్థం చేసుకోవనే నా నమ్మకం...'' అన్నాడు, శ్రీధర్.

శేఖర్‌కి,ఒక్కసారి కళ్లు తిరిగినట్టయ్యింది. తనెదుట అంతా చీకటిగా వున్నట్టు క్షణం ఫీలయ్యాడు. ఏమిటి తను వింటున్నది? నరహరి ప్రవర్తన గురించి తనుగాని, కల్యాణి గాని, తప్పుగా వూహించలేదే! శ్రీధర్ లాంటి సుస్నేహితుడు, సన్నిహితుడు, శ్రేయోభిలాషి చెబుతున్న మాటల్ని తను నమ్మకుండా యెట్లా వుండగలడు?... ఈఆలోచనల అలలమధ్య క్షణంపాటు యిరుక్కుని మాట్లాడలేక పోయాడు.

పరిస్థితిని యిట్టే గ్రహించిన శ్రీధర్, మళ్లీ అన్నాడు.

"ఆలోచనల్లో పడితే లాభంలేదు శేఖర్! మనం విద్యావంతులం. సంస్కారం మన సొత్తు. కాదనను. మనమూ సంఘంలో ఒక భాగం. పరిస్థితుల్నీ, వ్యక్తుల్నీ, మనం దృష్టిలో పెట్టుకుని మసలడం మనకీ అవసరమే: చనువుంది గాబట్టి స్నేహితుడిగా నా బాధ్యత తీర్చుకున్నాను. తరువాత నీ యిష్టం. నువ్వుగాని, మీ ఆవిడగాని నన్ను అపార్థం చేసుకోకుండా వుంటే సంతోషిస్తాను. వెళ్ళొస్తా మరి!'' అంటూ వెళ్లిపోయాడు.

కాస్సేపటి వరకూ, శేఖర్ ఆలోచనల మధ్య నలిగిపోయాడు. సిగరెట్టు ముట్టించాడు. మెదడు వేడెక్కి పోయింది. కణతలు పట్టుకుని అలా కూచుండి పోయాడు.

* * *

సాయంత్రం ఆరింటికి ఇల్లు చేరుకున్నాడు, శేఖర్. కల్యాణి అప్పుడే నరహరి కారులో వెళ్ళినట్టు చెప్పింది వంటమనిషి. ఇంతవరకూ యెప్పుడూ లేని అసహ్యం ఆతనిలో మొలకెత్తింది ఆక్షణంలో. చిరుకోపం, అతణ్ణి చీకాకు పర్చింది. విసుగ్గా క్షణం పచారుచేసి, సోఫాలో కూలబడ్డాడు. వంటమనిషి కాఫీ తెచ్చి అందిస్తే, తాగాడు. చిన్నబ్బాయి దగ్గరకొచ్చి యేవో కబుర్లు చెబుతూ వుంటే, పరధ్యానంగా 'వూఁ' కొడుతున్నాడే తప్పించి, సమాధానాలు చెప్పడం లేదు. అతని ఆలోచనలే వేరు.




రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది. బైట కారాగింది. డోర్‌వేసిన చప్పుడు. కల్యాణి 'గుడ్‌నైట్' అని చెప్పాక, కారు కదలడం శేఖర్‌కి స్పష్టంగా విన్పించాయి. మనసులో యేమూలో ద్వేషం రగులు కుంటోంది చెప్పలేని ఓవిచిత్రమైన స్పందనకి లోనయ్యాడు శేఖర్. ముసిముసి నవ్వుకుంటూ లోపలికి వచ్చింది కల్యాణి. భర్త వున్న గదిలోకి వచ్చి, బాగా అలసిపోయినట్టుగా వుస్సురనుకుంటూ, భర్తకి అభిముఖంగా వున్న సోఫాలో కూలబడింది.

"అబ్బబ్బ! రిహార్సలంటే వుండుండి విసుగుపుడుతోందండి! ఒకరొస్తే, మరొకరు వేళకి రారు. వచ్చినా, పోర్షన్లు కంఠస్థం చెయ్యరు. ఏవో సాకులు మాత్రం సవాలక్ష చెబుతారు. కొందరు మరీ అధ్వాన్నంగా వున్నారు'' అంది కల్యాణి విసుగ్గా, భర్తకేసి చూస్తూ.

"అంత విసుగు పుడుతూ వుంటే, ఎందుకా రిహార్సలుకి వెళ్లడం? నాటకం వెయ్యడమే మానేయకూడదూ?'' తనలో మొలకెత్తిన ద్వేషాన్ని పైకి పొక్కనీయకుండా, మామూలు ధోరణిలో అన్నాడు.

కల్యాణి, కళ్లింతవి చేసుకుని మరీ భర్తకేసి చూసింది.

"మంచివారేనండీ! కళలంటే ముఖ్యంగా నాటకకళంటే విసుగుపుడితే యెట్లాచెప్పండి? అందరూ విసుగు పెంచుకొని, నాటకాలే మానేస్తే, ఆ కళ అభివృద్ధి చెందేదెట్లా?'' తనే గొప్పగా కళాసేవచేస్తున్నట్టు ఫీలవుతూ అంది కల్యాణి.

బరువుగా ఓ నిశ్వాసం విడిచాడు, శేఖర్. చెప్పదల్చుకున్నది చెప్పడానికి ధైర్యాన్ని కూడ దీసుకున్నాడు.

# ఇల్లాలి నిర్ణయం

"ఏమైనా, నువ్వు ఆ నరహరితో తిరగడం మాత్రం నా కిష్టంలేదు కల్యాణీ! ఇహనించి నాటకాలే మానుకుంటే మంచిదనిపిస్తోంది" అనిమాత్రం చెప్పగలిగాడు, శేఖర్.

కల్యాణి, నిలువునా నిర్ఘాంతపోయింది. భర్తనోట, అటువంటి మాట యేనాడూ వినలేదు. తన స్వేచ్ఛని ఆయనెప్పుడూ అవరోధపర్చలేదు. ఒక పరిధిలో వుండమని, యే రోజూ శాసించలేదు. అటువంటి వ్యక్తి నోట యీ నాడు, నరహరితో తిరగడం మానేయమన్న ఆంక్ష వినడం ఆమెకి అశ్చర్యమూ కలిగింది. దాంతోపాటు మైల్డ్‌గా కొంచెం ఆగ్రహమూ కలిగించింది.

"ఏమిటండీ మీరంటున్నది? నేనేం వూరికే షికార్లు తిరగడం లేదుగా ఆయనతో. రిహార్సలుకని వెడుతున్నాను. అదీ రహస్యంగా వెళ్లడం లేదు కూడా! మిమ్మల్ని అడిగే వెళ్తున్నాను. హఠాత్తుగా మీలో యీమార్పు రావడానికి కారణం యేమిటో వూహించలేక పోతున్నాను. నరహరిగారికి నాటకాలంటే ఒక రకం పిచ్చి. ఆ పిచ్చితోనే పాపం ఆయన మనింటికి కారులో వచ్చి నన్ను తీసుకెళ్తున్నారు. అటువంటి వ్యక్తిని మీరు అనుమానిస్తున్నారా?" సూటిగా భర్త మొహంలోకి చూస్తూ, విసురుగా అంది. ఆమె మొహం అప్పటికే కందగడ్డలా మారి పోయింది.

శేఖర్ కాస్తంత తడబడ్డాడు. "అనుమానించడం కాదు కల్యాణీ..." అని యింకేమో చెప్పబోతూ వుంటే, ఆమె అడ్డొచ్చింది, ఖంగుమనే గొంతుతో.

"చాల్లెండి... మరింకేం చెప్పొద్దు. మీ సంకుచిత మనస్తత్వం, సభ్యతలేని మీ సంస్కారం, అర్థమయ్యాయి. ఎవరైనా వింటే నవ్విపోతారు కూడాను. చెప్పకుంటే సిగ్గుచేటు. ఆఫీసరుగిరీ వెలిగిస్తుంటే సరా? సభ్యత, సంస్కారం అలవడాలి... తల్చుకుంటే నాకే యేహ్యాభావం పుడుతోంది..." అంటూ రివ్వున లేచింది.

శేఖర్ వొళ్లు చల్లబడింది. అతనికి తగువులంటేనే భయం.

"కోపం తెచ్చుకోకు కల్యాణీ. నేను, నీ ప్రవర్తనని శంకించడంలేదు. అయితే నరహరి ప్రవర్తన మంచిది కాదన్న వార్తలు అందుతున్నాయి. మనం ఎంత నిర్మలంగా వున్నా, సంఘానికయినా కాస్తంత వెరవాలి గదా! అందుకనే అతనికిదూరంగా వుంటే మంచిదని చెబుతున్నాను" అన్నాడు, సౌమ్యంగా.

"మిమ్మల్ని మీరు సమర్థించుకోడానికి ప్రయత్నించకండి. మీరింతగా దిగజారి పోతారని, నేనెప్పుడూ వూహించలేదు..." అంటూ విసురుగా తన గదిలోకి వెళ్లిపోయింది, కల్యాణి.

పిల్లలు, వింతగా చూస్తూ నిలబడ్డారు. తల్లి వెళ్లిపోతూవుంటే, ఆమెని అనుసరించారు.

శేఖర్, వుస్సురనుకుంటూ సోఫాలో కూలబడిపోయాడు. ఈ విషయంలో మరీ రభస చెయ్యడం, తన సంస్కారానికే గొడ్డలిపెట్టని పించింది. అతని మెదడు మాత్రం ఆలోచిస్తూనే వుంది.

* * *

మూడు రోజులు గడిచాయి. కల్యాణి మామూలుగానే రిహార్సలుకి వెళ్లి వస్తోంది, నరహరికారులో. శేఖర్ ఆమెని అవరోధపర్చలేదు అవరోధపర్చి, వాగ్వివాదాలు పెంచుకుని, నలుగురిమధ్య పడ్డం అతనికి మనస్కరించలేదు. కల్యాణి అన్నట్లుగానే మిగతావాళ్లు కూడా తన సంస్కారాన్ని గేలిచేస్తారనే భీతి కూడా అతనికి లోలోపల లేకపోలేదు. తను చెప్పినా, లక్ష్యపెట్టకుండా వెళ్తోన్నభార్యపై మొదట్లో కోపం వచ్చినా, తమాయించుకున్నాడు.

నాలుగో రోజు—

రాత్రి ఎనిమిది అప్పుడే దాటింది. శేఖర్ షేక్స్‌పియర్ నాటకాల సంపుటిని చదువుతున్నాడు. పిల్లలు వరండాలో ఆడుకుంటున్నారు. కల్యాణి, రొప్పుకుంటూ వచ్చింది లోపలికి. కారువచ్చిన శబ్దం వినపడలేదు శేఖర్‌కి. ఆశ్చర్యపోయాడు, బైటికి చూశాడు. ఓ రిక్షా వెనక్కి తిరిగిపోతోంది.

"ఇదేమిటి కల్యాణీ, ఇవ్వాళ నరహరి కార్లో డ్రాప్ చెయ్యలేదా?" అన్నాడు శేఖర్.

కల్యాణి కళ్లు చింతనిప్పుల్లా మెరుస్తున్నాయ్. మొహం యెర్రబారింది.

"ఆ స్కౌండ్రల్ పేరెత్తకండి..." అంది కసిగా సోఫాలో కూచుంటూ, అమె మొహంలో యేదో ఆత్రుత, ఆరాటం, భయం, తొంగి చూస్తున్నట్లు కనిపించింది. తెల్లని ఫాల భాగంపై చెమట బిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయ్. చప్పున రుమాలుతీసి మొహం ఒత్తుకుంది కల్యాణి.

# మీ పసిపాప గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం

## మీరు కాల్షియం-శాండోజ్ తీసుకోండి

పసిపాప పెరుగుదలకు తల్లే ఆధారం కేవలం కాల్షియం మాత్రమే పసిపాప యొక్క ఎదిగే పళ్ళు, ఎముకలను వృద్ధి చెయ్యగలదు మీ పసిపాపకు కావలసిన కీలకమైన పాళ్ళలో కాల్షియం ఇవ్వటం కోసం మీరు తప్పని సరిగా 3-4 కాల్షియం శాండోజ్ బిళ్ళలను రోజుకు 3 సార్లు చొప్పున చప్పరించాలి. కమ్మని, రాస్‌బెరీ రుచి కలిగిన కాల్షియం-శాండోజ్ విటమిన్లు సి, డి మరియు బి$_{12}$తో పుష్టివంతం చేయబడింది.

శాండోజ్‌ను విశ్వసించండి—వారు ప్రపంచంలో శుద్ధమైన కాల్షియం తయారీలో ముందంజ వేసారు.



**కాల్షియం-శాండోజ్®**

**ప్రతి రోజు ప్రతివారికి।**




పాలిచ్చే తల్లికి మిగతావారి కన్న 3 రెట్లు ఎక్కువగా కాల్షియం అవసరం మీకు అవసరమైనంతగా లభిస్తోందా?

dCP/CS/8d Tel

# ఇల్లాలి నిర్ణయం

"ఏం జరిగింది కళ్యాణీ? నీ మాటలు నాకేం అర్థం కావడంలేదు. నరహరి యిప్పుడు స్కాండ్రల్ అయ్యాడంటే, యేదో కారణం వుంటుంది." అన్నాడు శేఖర్.

కళ్యాణి కళ్లల్లో నీరు గిర్రున తిరిగింది. మొహంలో రంగు మారింది.

"నన్ను మరీ చిత్రవధకు గురికానివ్వకండి... ప్లీజ్..." అంది రుద్ధ స్వరంతో. "ఆరోజు మీరు చెప్పినా, మీ హితవు మాటల్ని లెఖ్ఖ చెయ్యలేదు. పైగా మీ సంస్కారాన్ని గేలిచేశాను. ఫలితంగా యిప్పుడు బాధపడుతున్నాను..."

"ఏమయ్యింది యింతకీ?" అంటూ ఆతృతగా అడిగాడు.

"ఇన్నాళ్లూ ఆ నరహరిని యెంతో సంస్కారం, సభ్యతగల వ్యక్తిగా భావించి గౌరవించాను. నాటకకళ వుద్ధరించడానికే ఆయన పాటుపడుతున్నాడని వూహించాను. నా దృష్టిలో అతనప్పుడు వున్నతుడు. కాని, యీ రోజు వాడి నిజరూపం తెలిసింది. కారులో తీసుకొస్తూ, అసభ్యంగా మాటలు ప్రారంభించి, నన్ను లోబర్చుకోవాలని ప్రయత్నించాడు. వాడికి తగిన బుద్ధిచెప్పి, కారులోంచి దిగి, రిక్షాలో వచ్చేశాను. వాడు ద్రోహి... వంచకుడు. సంస్కారంలేని రాస్కెల్... ఈ విషయంలో మిమ్మల్ని అనవసరంగా అపార్థం చేసుకుని, మీ మనస్సుకి కష్టం కలిగించాను. నన్ను క్షమించండి." అంటూ రెండు చేతుల్తో మొహం కప్పుకొని వెక్కివెక్కి యేడ్చింది.

శేఖర్‌కి శ్రీధర్ మాటలు గుర్తుకొచ్చాయి. కళ్యాణికి దగ్గరగా వెళ్లి, చేతులు మొహం మీంచి తీసేస్తూ "ఛా! అదేమిటి కళ్యాణీ! పోనీ, యిప్పటికయినా నిజం తెలుసుకున్నావు, అదే చాలు. కనీసం నాలోని సంస్కారం తెలుసుకున్నందుకు అవకాశం చిక్కింది... ఇక అదంతా మర్చిపో!" అన్నాడు మెల్లగా మందహాసం చేస్తూ.

కళ్యాణి రుమాలుతో మొహం తుడుచుకుంది.

"నిజమేనండీ. మీ సంస్కారాన్ని గేలిచేస్తి నేనే సంస్కారహీననయ్యాను. అందుకు సిగ్గు పడుతున్నానుకూడాను. ఈ రోజునించీ నాకు నాటకాలంటేనే అసహ్యం యేర్పడింది. మరెప్పుడూ వెయ్యను." అంది పశ్చాత్తాపంతో. శేఖర్ నవ్వేడు.

"మరీ అంత గా మారిపోకూడదు కళ్యాణీ! అందరూ నరహరిలా వుండరుగా? మనుషుల్ని బట్టి మనమూ ప్రవర్తించాలి."

"వద్దండీ! మీరన్నట్టు సంఘాన్ని కూడా దృష్టిలో పెట్టుకోవాలిగా. అయినా, నేనో నిర్ణయానికొచ్చాను. మరెప్పుడూ నాటకాలు వెయ్యను. చాలు, యీ అనుభవం." అంది కళ్యాణి.

శేఖర్ ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. పిల్లలు వాళ్లిద్దర్నీ దూరంగా నిల్చుని చూస్తున్నారన్న సంగతి గుర్తించిన శేఖర్ కంగారుగా వెనక్కి అడుగు వేశాడు నవ్వుకుంటూనే.

"లేవండి...భోజనం చేద్దాం..."అంటూ లోపలికి నడిచింది కళ్యాణి. పిల్లలు ఆమె వెంట నడిచారు.

ఆ క్షణంనించీ కొత్త జీవితం ప్రారంభమైనట్టుగా అనుభూతిని పొందాడు శేఖర్. శ్రీధర్‌ని మాత్రం ఓ మారు మనసులో అభినందించుకున్నాడు.

## ఆటల పోటీ

—ఎల్. మాలకొండయ్య

వ్యాపార మనే ఆటల పోటీలో
అన్నిటికన్నా మిన్న అధికలాభాల ఆట!
ఆట క్రికెట్ విధానంలో ఆడినా
గోల్ఫ్ దొంగదాటుగా కొట్టినా
పొందే ఫలితం అధికలాభమే!
సరుకుల పంపిణీ సంగీతంలో
అధికలాభాల పాటలే ఆధునిక బాణీలు
ప్రాణ రక్షణ నిచ్చే సరుకుల్లో
ప్రాణాలు తీసే కల్తీ విష పదార్థాలే
ఈ సంగీతంలో సరిగమ స్వరాలు!
మెదడులోని మెలికలు
చేతి మలుపుల మసలికలు
కనురెప్పల మాయ కదలికలు
ముసుగులోని గుసగుసలు
అధిక లాభాల ఆటల పోటీలో
విజయానికి విచ్చెనలు!
ఈ అధిక లాభాల ఆటల పోటీలో
ఆటగాళ్లు తామే, అంపైర్లు తామే!
అందుకనే వోడిపోయేది ఎప్పుడూ పేదప్రజలే!

# మీ ప్రత్తి దిగుబడిని 20% దాకా అధికం చేసుకోండి

# మొక్కల హార్మోన్ ఎసిమోన్ వాడండి




అంతే మీకు ఎక్కువ కాయలు లభిస్తాయన్న మాట. ప్రత్తి యేకుల పరిమాణం కూడా బాగా పెరుగుతుంది. ఫలితంగా మీరు అధిక దిగుబడిని సాధిస్తారు.

**ఎసిమోన్ అంటే ఏమిటి?**

ఎసిమోన్ సహజంగా మొక్కల పెరుగుదల రేటును, స్వభావాన్ని అదుపులో ఉంచే సహాయక పదార్థాలవంటి పదార్థాలుగల సింథెటిక్ మిశ్రమము. దీనిని ఒకసారి మొక్కలపై చల్లితే మొక్కలు భూమిలో నుండి పోషక పదార్థాలను అత్యధికంగా గ్రహించేటట్లు చేస్తుంది.

**మీరు అనుకుంటున్న దానికంటె ఆదా అయినది**

ఎకరానికి ఒకే ఒక ఎసిమోన్ సీసా చాలు. ఇది కీటక నాశనులు, ఎరువులకు అనుగుణ్యమైనదే గనుక శ్రమ, ఖర్చు కూడా బాగా ఆదా అవుతుంది.

ఎసిమోన్‌ను పొగాకు మిరప, మామిడి, అనాస, ఆపిల్, పియర్స్, బంగాళాదుంప, గులాబి, రబ్బరు, గోధుమ, వరి, జొన్న, చెరకు మరియు ఎన్నో ఇతర పైర్లపై కూడా వాడవచ్చును.



**దేవిదయాల్ ఎగ్రో కెమికల్స్**

దేవిదయాల్ (సేల్స్) ప్రైవేట్ లిమిటెడ్ వారి విభాగము
గుప్తా మిల్స్ ఎస్టేట్, రే రోడ్, బొంబాయి-400 019

మీ ప్రత్తి పైరుపై ఎసిమోన్ చల్లి, జరిగే మార్పును మీ అంతట మీరే చూడండి. సామాన్యంగా రెండు, మూడు పూవులు వేసే కొమ్మపై 5 లేక అంతకన్న ఎక్కువ పూవులు పూయడం జరుగుతుంది—పూవులు రాలి పోవడం కూడా చాలా వరకు తగ్గిపోతుంది.

**తెగుళ్ళ వినాశనులు లభించే అన్ని షాపులలోనూ సులభంగా దొరుకుతుంది.**

డిస్ట్రిబ్యూటర్లు: గజలక్ష్మి ఎంటర్‌ప్రైజెస్, 4/8 దామునగర్, పులియకులం, కోయంబత్తూరు--641018 * జయ ఆగ్రో కెమికల్స్, మెయిన్‌రోడ్, కాకినాడ. * శ్రీ మహాలక్ష్మి అగ్రో సర్వీసెస్, కాకుమాను, (వయా) పెదనందిపాడు, గుంటూరు జిల్లా. * క్రాంతి & కంపెనీ, గాంధినగర్, కరీంనగర్. * ఒగని లక్ష్మయ్య అండ్ సన్స్, నల్గొండ

# అతకని అనుబంధాలు

సీరియల్

పి. యస్. శాస్త్రి

రచన నాకు అభిమాన పాత్రమైన విషయంగా కనిపెట్టి, నా రచనా వ్యాసంగానికి అనేక విధాల తోడ్పడి నన్నో రచయితగా రూపొందించారాయన. క్రిందటి సంవత్సరం ఆయన మహా సమాధి చెందటంతో నేనిప్పుడు ప్రపంచంలో నిజంగా ఏకాకిని పతీ!'' శ్యామ సుందరం కళ్లు చెమరుస్తున్నాయి.

లక్ష్మీపతి ఆప్యాయంగా శ్యామసుందరం చేయిపట్టుకుని నొక్కాడు.

''నువ్వు ఏకాకివి కాదు సుందరం! నా ఆత్మబంధువువి! ఈ పతి ఎట్టి పరిస్థితుల్లోనైనా నువ్వు నమ్మదగిన హితుడు, స్నేహితుడు, బంధువు అన్న విషయం మరచిపోకు! ఫూల్! ఇన్ని రోజుల పరిచయం తర్వాత కూడా నీ ఏకాకి తత్వం వదులుకోకపోవడం నీ తప్పో, నా తప్పో తెలియటంలేదు! ఇంకోసారి 'ఏకాకిని' అన్న మాట వాడావంటే నిజంగా నిన్నేకాకినిచేసి నాదారిని నేనుపోతా!'' లక్ష్మీపతి గొంతులో ఆప్యాయత ఆర్ద్రత కలిసి ధ్వనించాయి. అందులో తన సూన్నతతో శ్యామసుందరాన్ని నమ్మించాలన్న ఆతృత అధికంగా వుంది.

లక్ష్మీపతి కంఠంలోని, నిజాయితీకి, ఆప్యాయతకు కరిగిపోయాడు శ్యామసుందరం.

''పతీ! నువ్వు చెప్పింది నిజమే! కాని చిన్నతనం నుండి వెంట పట్టిన 'ఏకాకి' 'అనాథ' అన్న పదాలు, ఆ తత్వం, నన్నంత తొందరగా వదిలిపెట్టటంలేదు! నీ స్నేహాన్ని శంకిస్తున్నాననుకోకు! నన్ను క్షమించు! నా ఉద్యోగం, పెంపకంతో, నిమిత్తం లేకుండా నన్ను నన్నుగా ప్రేమించే నీ లాంటి స్నేహితుడు దొరకడం నా అదృష్టం! నీవు పంచి యిచ్చిన ఆప్యాయత, తల్లిదండ్రులు, సోదరుల ఆప్యాయతకేం తీసిపోదు!'' శ్యామ సుందరం గొంతుకు భారంగా పలికింది. కర్చీఫుతో కన్నీళ్లు తుడుచుకున్నాడు.

తననెవరేనా పొగిడితే ఏంచెయ్యాలో

*(గత సంచిక తరువాయి)*

తెలియని లక్ష్మీపతి పడుకున్న స్థలంలో యిబ్బందిగా కదిలాడు.

''సినిమాలు, నాటకాలలో కంటె హెవి డైలాగులు వాడేసాం! కాని యిలాగే కూర్చుంటే యీ వాతావరణంలోని 'హెవినెస్' తగ్గదు! మన పురుష మిత్రులు, స్త్రీ మిత్రురాండ్రు ఏంచేస్తున్నారో చూద్దాం పద!'' గంభీర వాతావరణాన్ని నవ్వుల్లోకి దించడానికి ప్రయత్నించాడు లక్ష్మీపతి.

శ్యామసుందరం కూడా లేచాడు.

ఎవరో పిట్లు వున్న చెట్టుమీద రాయి విసరేరు. చెట్టుమీద వున్న పిట్టలన్నీ గోల చేస్తూ పైకెగిరాయి. వాటి కంగారు, భయం చూస్తే శ్యామసుందరానికి జాలికలిగింది. కొందరికి ప్రకృతి తన సహజ స్వరూపంతో నిశ్చలంగా వుంటే అందులో నిశ్శబ్దంగా కలిసిపోయి ఆ ప్రకృతినిచూసి ఆనందించటం యిష్టం. మరికొందరికి నిశ్చల ప్రకృతిలో

*జరిగినకథ: 3* నవలా చిత్రీకరణ కొరకు స్నేహితుడు లక్ష్మీపతితో నాగార్జునసాగర్‌కు వచ్చిన శ్యామసుందరానికి తోటివిహారయాత్రీకులు సౌమిత్రి, మాయ, కల్పన, కాంచనలతో పరిచయమౌతుంది. శ్యామసుందరం అక్కడి శిధిలాలనూ, వాటి పూర్వ చరిత్రనూ మిగిలినవారికి వివరించి చెప్తూంటాడు. ఒకేరకపు స్వభావాలున్న మాయ, లక్ష్మీపతి; శ్యామసుందరం, సుమిత్రలు పరస్పరం ఆకర్షితులౌతారు. లాంచీకి రిపేరు రావడంతో నాగార్జున కొండపై చిక్కడిపోతారు యాత్రీకులంతా. శ్యామసుందరానికి తల్లితండ్రులున్నారో లేదో తెలీదని, అనాథాశ్రమంలో పెరిగాడని తెలుసుకుంటాడు లక్ష్మీపతి

చలనం కలిగించి, ఆ సంచలనానికి ఆనందించటం అలవాటు! ఎన్నిరకాల ప్రవృత్తులో యీ మానవులవి! మానసికంగానూ బాహ్య స్వరూపంలోనూ, యే వ్యక్తీ మరొకవ్యక్తిని పోలి వుండడు కదా, యీ సువిశాల ప్రపంచంలో! ఇన్ని కోట్ల మానవుల్లోనూ వొకే లాంటి యిద్దరు వ్యక్తులుండక పోవడం యీ ప్రకృతి వింతల్లో కన్నింటిల్లోకి పెద్దవింత!

''ఆ ఎగిరే పిట్లల్ని చూసావా? వాటిని అలాగే చిత్రించగలిగితే ఎంత అందంగా వుంటుందో!'' ఎవరో మాట్లాడుకుంటూ శ్యామ సుందరం, లక్ష్మీపతి కూర్చున్న చెట్టు వైపుకు వస్తున్నారు.

చెట్టు మొదలునుంచి బయటకొచ్చిన మోహన్, మురళీలను చూసి లక్ష్మీపతి వాళ్లని పిలిచాడు.

''హలో మురళీగారు! మీరిద్దరే వచ్చారేం? మీ మిగిలిన స్నేహితులేమయ్యారు?'' అని పలకరించాడు.

''ఈ కొండమీద అటుచివర వున్న వాటర్ వర్క్సు దగ్గర వున్న పంప్ హవుస్‌ను చూడటానికి వెళ్లారండీ వాళ్లు!'' మురళీ జవాబిచ్చాడు.

''అసలు సంగతి నన్ను చెప్పమన్నారా? అక్కడకు సుమిత్ర, మాయ, కాంచన, కల్పన యింకా మిగిలిన స్త్రీలు వెళ్లారు. అందుకే అప్పుడే అక్కడినుంచి తిరిగి వస్తున్నా, మళ్లీ బయలుదేరారు వాళ్లు!'' మోహన్ నవ్వుతున్నాడు.

లక్ష్మీపతి, శ్యామసుందరాలు కూడా నవ్వారు.

''యువకులు సర్వసాధారణంగా సౌందర్యారాధకులు! అలా వెళ్లటంలో తప్పలేదు! ఆ తర్వాత ఏమన్నా అవకతవకగా ప్రవర్తిస్తేనే ప్రమాదం!'' శ్యామసుందరం నవ్వుతూనే అన్నాడు.

''మీరు చాలా ముసలివాళ్ళలా మాట్లాడుతున్నారు!'' మురళి నవ్వాడు

"రచయితలు మాటల్లో ముసలివాళ్ళగా మారిపోగలరుకదా!" లక్ష్మీపతి నవ్వాడు.

"శ్యామసుందరంగారు రచయితా?" మోహన్, మురళీ యిద్దరూ వొకేసారి అడిగారు ఆశ్చర్యంగా.

"అవును 'శ్రీ' అనే పేరుతో రచనలు చేస్తూంటాడు." లక్ష్మీపతి జవాబిచ్చాడు.

'అలాగా! చాలా సంతోషం' అన్న వాళ్ళ కంఠాల్లోనూ, ముఖాల్లోనూ శ్యామసుందరం అంటే అడ్మిరేషన్ కనబడుతోంది.

"మా మురళికూడా వో పిచ్చి అని చెప్పాను గుర్తుందా మీకు! ఉండి ఉండి బాహ్యలోకపు విషయాలకు తను అతీతుడైనట్టు మాట్లాడుతూ వుంటాడు. కన్నులకు మిరుమిట్లు గొలిపే సౌందర్యాన్ని ఆక్షణంలో చూసి ఆనందించటంలో వాడికి తృప్తి లేదుట! ఆ సౌందర్యాన్ని తన చిత్రాల్లో పట్టి బంధించులాడట!" మోహన్ నవ్వుతూ అన్నాడు.

"ఆంధ్ర దేశంలోని ప్రతీ రెండోవ్యక్తి రచయితే అని వొకరు అంటే, ప్రతీ నాలుగో వ్యక్తీ చిత్రకారుడే అని ఎవరో చమత్కరించారు!" లక్ష్మీపతి నవ్వుతూ అన్నాడు.

"అంతే కాదండీ! ఆంధ్ర దేశంలో ప్రతి యిద్దరు వ్యక్తులకు మూడు పార్టీలుంటాయట!" మోహన్ నవ్వుతూ అన్నాడు.

అంతా ఘొల్లుమని నవ్వుకున్నారు.

"ఇంతకీ మీ స్కెచ్ బుక్‌ను నింపారా లేదా? శ్యామసుందరం, మురళిని కుతూహలంగా ప్రశ్నించాడు.

"ఊహూ! ఏమీ వర్క్ చేయలేక పోయానండీ? ప్రస్తుతం అన్నీ బుర్రలోనే రికార్డు చేస్తున్నా. ఇంటికి వెళ్ళాక వాటికో రూపం యివ్వటానికి ప్రయత్నిస్తాను."

"అవును! మీరు చెప్పింది నాకూ అర్థ మౌతుంది. ఒక దృశ్యాన్ని మనం చూసినప్పుడు అది మన చర్మ చక్షువులకు కనిపించినట్టు కాకుండా మనో నేత్రానికి కనిపించినట్టు చిత్రించడం కాని, రచన కాని చేస్తేనే అది కళాత్మకంగా వుంటుంది! లేకపోతే ఫోటో గ్రఫీలాగానూ, జర్నలిజం గానూ తయారవుతుంది.

ఇక్కడే వుండి యీ ప్రదేశాన్ని అందంగా వర్ణించటం కష్టం. అదే యింటికి వెళ్ళాక అయితే తేలిక! జ్ఞాపకాల సాయంతో యీ ప్రదేశాన్ని అందంగా పరిచయం చేయవచ్చు.

రచయిత 'ఎర్నెస్ట్ హెమ్మింగ్‌వే'కి కూడా అంతేనట. పారిస్‌లో వుండి అమెరికాలోని మిచిగాన్ రాష్ట్రాన్ని, పారిస్ వదిలి వెళ్ళాక పారిస్‌ను బాగా చిత్రించ గలుగు అంటాడాయన!" శ్యామసుందరం చెప్పబోతున్నాడు ఇంకా ఏదో! "ఇద్దరు కళాకారులు మొదటిసారి కలుసుకున్నప్పుడు తమ, తమ కళల గురించి తప్ప వేరే విషయాలు మాట్లాడటం చూశారా మీరు?" లక్ష్మీపతి నవ్వుతూ మోహన్ని అడిగాడు.

"ఇది కళాకారుల బలహీనత పతీ! దానికి క్షమించాలి నువ్వు!" శ్యామసుందరం నవ్వాడు.

"ఆల్‌రైట్! మనమిప్పుడింక మామూలు మనుషుల్లా మాట్లాడుకుందాం మురళీగారు! లేకపోతే వీళ్ళు మనని గోలచేస్తారు!" అని శ్యామసుందరం మురళితో అని పతి వైపుకు తిరిగి "పతీ! మనం కూడా పంపు హవుస్ దగ్గరకు వెడదామా? అక్కడ ప్రకృతి



సౌందర్యం అద్భుతంగా వుండవచ్చు!' అన్నాడు పతితో!

"ప్రకృతి అందంగా వుంటుందో ఆ ప్రకృతిలోని సుందరీ మణులు అందంగా వుంటారో చెప్పలేదు మీరు! గురూగారూ" మోహన్ నవ్వుతూ అన్నాడు. అంతా నవ్వుకున్నారు.

అంతా మెల్లి మెల్లిగా పంపు హవుసు వున్న తారు రోడ్డమ్మట నడవటం మొదలు పెట్టాడు.

సూర్యుడు పడమరకు దిగజారాడు. చెట్ల నీడలు పొడవుగా సాగుతన్నాయి. ఎండ వేడి తగ్గటంతో మనుష్యుల మనసులు కూడా తేలికవుతున్నాయి. దారిలో కనిపించిన కుళాయి దగ్గర మొహాలు కడుక్కున్నారు వాళ్ళు.

మళ్ళీ రోడ్డుమీద నడుస్తున్న వీళ్ళకు భూషణరావుగారు, ఆయన భార్య హైమవతి, పిల్లలు మధు, సుధలు కనిపించారు. వాళ్ళు వో పెద్ద చెట్టు క్రింద కూర్చున్నారు విశ్రాంతిగా. పిల్లలిద్దరూ కులాసాగా తండ్రితో కబుర్లు చెబుతున్నారు. హైమవతి వాళ్ల ముగ్గురివైపు చూస్తోంది.

పంపు హవుస్ నుండి కుమార్, ప్రసాద్‌లు, తిరిగివచ్చేస్తూ కనిపించారు వీళ్ళకు.

వీళ్ళను చూసి "ఏం లాభం లేదు! వాళ్లంతా తిరిగి వచ్చేస్తున్నారు" అని నవ్వారు.

"ఏం ఫరవాలేదు! మనం లేటే వెడుతూంటే వాళ్ళంతా వచ్చి ప్రొద్దున్న లాగే కవిగారి చుట్టూ చేరవచ్చు! లేటే పోదాం పదండి!" మోహన్ కొంటెగా నవ్వుతూ శ్యామసుందరం వైపు చూసాడు.



జై ఆంధ్రా ఉద్యమంలో వీర కాకానికి సర్దార్ చిట్టి యువజన సేనను యేర్పాటు చేసి, ఉద్యమంలో తిరిగిన పి. భరణి చదువు కూడా దెబ్బ తిన్నదట! అదే టైములో మంత్రులందర్నీ చూశాడు. వారి అప్పటి ఆవేశం గ్రటా చూసి "చాలా గొప్పవారని" అనుకున్నాట్ట. కాని తరువాత వారుకూడా మామూలు అందరిలాంటి వారేనని తెలిపోయిందని కోపంగా చెప్పాడు. బి. కామ్. ఫైనలియర్ కొచ్చిన భరణి, "అంతా ఉద్యోగాలకోసం ఎదురుచూస్తే నిరాశ నిస్పృహలే మిగుల్తాయేమో, ఏదైనా వ్యాపారం చేద్దామా?" అన్న ఆలోచనలో కూడా ఉన్నాడట!

వూళ్ళో ఎక్కడైనా నడిచే తిరుగుతాడు. ఆరోగ్యకరమైంది నడక గనుక— అమ్మాయిలను ఏడిపించడం వాళ్ళచేత తిరిగి ఏడిపింపబడటమూ యివన్నీ సహజమే కనుక పరస్పర పరాభవం లాంటిది లేదన్నాడు.

ఇందిరా గాంధీగారు అసాధ్యురాలు. నెహ్రూ పటేల్, బోసు, శాస్త్రీజీ అందర్నీ కలబోసి చేస్తే ఆమె తయారవుతుందిట! పత్రికల్లో మొదట సినిమా శీర్షిక చదివే 'భరణి'కి, జానపదాలు, హాస్యరస భరిత చిత్రాలు యిష్టం. చెడుగుడు ఆడతాడు — ఫుట్ బాల్ ఆడాలనుంది కాని కాలేజీలో గ్రౌండ్ లేదు. అదీ సంగతి.

—కృష్ణానంద్

---

శ్యామసుందరం మనస్సు ఆ డాక్టరు దంపతుల్ని గురించే ఆలోచిస్తోంది. ఎంత ముచ్చటైన కుటుంబం అది! వాళ్ల మధ్య నున్న అనురాగాన్ని ఆప్యాయతని చూస్తుంటే తన మనస్సు తెలియని విషాదంలో మునుగుతోంది. అటువంటి అనురాగానికి నోచుకోకుండా వొంటరిగా బ్రతకవలసి రావటం ఎంత దురదృష్టం!

శ్యామసుందరం మనసులో చెలరేగుతున్న భావాలను చదవగలిగిన లక్ష్మీపతి జాలితో నిట్టూర్చాడు. శ్యామసుందరం ఆలోచనల్ని మరోవైపు మరలిస్తేతప్ప అతను మరీ విషాదంలో పడిపోతాడు. ఏంచేస్తే బావుంటుందా అని ఆలోచించ సాగాడు లక్ష్మీపతి.

శ్యామసుందరం డాక్టరు దంపతులవైపు చూడటం గమనించిన కుమార్ మెరిసే కళ్లతో "ఏమిటంత దీర్ఘంగా చూస్తున్నారు. ఆ డాక్టరు గారినేనా? బాగా చూడండి! ఆయన నాకు తెలుసు. ఆయనదో వింత కథ! చావును ఆఖరిక్షణంలో తప్పించుకుని, మారిపోయి, ప్రజల సేవ చేస్తున్న డాక్టరుగారాయన! ఆయన భార్య హైమవతి గారికి ఆయనంటే ఎంత ఆప్యాయతో చెప్పలేం!..." ఇంకా ఏదో చెప్పబోతున్న కుమార్ని,

"ఒరేయ్! అమ్మాయి లొస్తున్నారు. నువ్వు కాసేపు నీ సోది నాపుతావా?" అని వారించాడు మోహన్.

డాక్టరు గారిని గురించి, ఆవిడను గురించి కుమార్ని యింకా ఏదో అడగాలనుకున్న శ్యామసుందరం ఆ ప్రయత్నం విరమించుకున్నాడు

## అతకని అనుబంధాలు

వాడిపోయిన మొహాలతో, నీరసంగా తిరిగి వస్తున్న అమ్మాయిల్ని చూసేసరికి శ్యామసుందరం మనసు ద్రవించి పోయింది. స్థలం కాని స్థలంలో, సరైన భోజనం లేక ఎండలో పడి తిరిగి యీ సుకుమారులిలా అయిపోయారు. ఆడపిల్లలు కావటం వల్ల సిగ్గుతో వొంటరిగా తాము నలుగురే తిరుగుతూ వుండి వుంటారు. వీళ్ళ సంగతి మరిచేపోయాడు తను! పైగా యిక్కడ మీకేం భయం వుండదు అని అభయమిచ్చిన ధీరులు తామూ, పతీ! వంటల సమయంలో వాళ్ళు అంత సాయం చేసినా, వాళ్ళు ఏమయ్యారో పట్టించుకోని కృతఘ్నులు తాము!

"అరెరె! ఎంత నీరసపడిపోయారో! కేంటీన్లో టిఫినో, కాఫీయో తీసుకోక పోయారా?" ఆతృతగా ప్రశ్నించాడు వాళ్ళని.

"లాంచీ యింకా బయలుదేరకపోతే అదే చేద్దామనుకుంటున్నాం" సుమిత్ర జవాబిచ్చింది.

లక్ష్మీపతిని చూడగానే మాయ మొహం వికసించింది. అది లక్ష్మీపతి చూసాడు. అతని మనసు ఆనందంతో గంతులు వేసింది. స్త్రీ కళ్ళల్లో తనంటె గుర్తింపు కనబడితే పొంగిపోకుండా మొగవాడుండగలడా?

అమ్మాయిలతో మాట్లాడుతూ లక్ష్మీపతి, శ్యామసుందరం ముందు నడుస్తున్నారు. వాళ్ళకు కొంచెం వెనుకగా మురళీ బృందం నడుస్తున్నారు

వీళ్ళు కాంటీన్ చేరేలోగా లక్ష్మీపతి లాంచీ బాగుపడితే చెప్పమన్న కుర్రాడు పరుగెత్తుకుంటూ ఎదురు వచ్చాడు.

"సార్! లాంచీ అప్పుడే బాగుపడేలా లేదుటండి! రాత్రికి యిక్కడే వుండవలసి వుంటుందని లాంచీవాళ్ళు మీకందరికీ చెప్పమన్నారు!" అంటూ వగరుస్తూ నిలబడ్డాడు.

ఆ మాట వింటూనే అమ్మాయిలు మ్రాన్పడిపోయారు. చుట్టూ భయంభయంగా చూసారు. చూడటానికి వచ్చి గంటా రెండు గంటలుండి వెళ్ళిపోతే యీ ద్వీపం చూడటానికి బాగానే వుంటుంది. కాని వొక్కరోజు సాయంత్రం వరకూ తిరిగితేనే ఎంత విసుగెత్తించిందో! ఇక్కడ రాత్రంతా గడపాలా? ఒక్క రెండు మైళ్ళ నీటిని దాటితే అవతల అనంతమైన భూమి వుంది! కాని యీ రెండు మైళ్ళ నీటిని దాటి ఆ నాగరిక ప్రపంచాన్ని చేరుకోవటం ఎంత కష్టం! ఆంధ్ర దేశానికి ఎంత మధ్యలో ఉన్నారో అంత దూరంగానూ వున్నారు తాము!

శ్యామసుందరం వాళ్ల మనసులో కదిలే భావాలను గ్రహించగలిగాడు. "మీరేం భయపడనక్కర్లేదు! మీకేబాధా కలగకుండా చూసే పూచీ నాది. మీకేం కావలసినా నేనూ మా పతీ, మా యూనివర్శిటీ మిత్రులూ అమరుస్తాం!" అన్నాడు.

"ష్యూర్ ష్యూర్!" అంటూ అబ్బాయిలంతా అభయహస్త మిచ్చారు.

ఆపదలోవున్న అబలల్ని చూస్తే అబ్బాయిల్లో సాధారణంగా 'శివత్రీ' పొంగి పొరలుతుంది! వారు ఆపదలో లేకుండా ఏ పట్టా

ణంలోనో కనిపిస్తే యేదోవొక కొంటె పని చేయడానికి వెనుకాడరు ఆ అబ్బాయిలు !

ఎంత మంది స్త్రీలు తమ అసహాయతని, భయాన్ని తమ ప్రియులకి, చూపి వాళ్లచేత వీరోచిత కార్యాలు చేయించారో చరిత్రతో పరిచయమున్న ప్రతివారికీ తెలుస్తుంది !

కేంటీన్‌లో టిఫిను అయిపోయింది. కాఫీ పాలు లేకుండా వొట్టి డికాక్షనుతో కలిపి యిస్తున్నాడు. 'బ్లాక్ కాఫీ' అనుకుంటూ దాన్నే ఆప్యాయంగా సేవిస్తున్నారు కాఫీ ప్రియులు ! శ్యామసుందరం బృందం కోకోలాలు త్రాగారు.

"పతీ ! మళ్లీ నీకు పని తగిలింది. మధ్యాహ్నం మనకు సాయం చేసిన మనుషులందర్నీ పిలిచి వెలుగు వుండగానే వంటలు

...లు పూర్తి చేయండి. ఇక్కడ జన రేటరు మూలాన్ని ఎలక్ట్రిసిటీ వస్తోంది. కాని కావలిసిన చోటకు యిప్పటి కిప్పుడు కనెక్షన్లు యివ్వకోలేం! ముందు భోజనాల సంగతి పూర్తయితే తర్వాత పడకల గురించి

## అతకని అనుబంధాలు

ఆలోచిద్దాం!'' శ్యామసుందరం లక్ష్మీపతితో అన్నాడు.

''నిజమే! చీకటి పడక ముందే వంటలు భోజనాలు అయిపోతే మంచిది!'' అంటూ లక్ష్మీపతి తనకు లాంచీ గురించి వార్త తెలిపిన కుర్రాణ్ణి దగ్గరకు పిలిచాడు.

''ఒరేయ్ గోపీ! నువ్వు పోయి యీ కొండ మీద వున్న టూరిస్టు లందరితో 'యీ రాత్రికి లాంచీ పోదు. అందరూ మధ్యాహ్నం వంటలు చేసిన స్థలం దగ్గరకు రావలిసింది' అని చెప్పిరారా!'' అని పురమాయించాడు వాణ్ని.

లక్ష్మీపతి రాత్రికి వంటలు చేయించే హడావుడిలో పడ్డాడు. కాంచన, సుమిత్ర, కల్పన, మాయ మ్యూజియం ఎదురుగావున్న ఇక్ష్వాకుల కాలపు బావిని చూస్తున్నారు. అంత ఎత్తైన కొండ మీద రాతిలో తొలిచిన బావిలో నీరు రావటం ఆశ్చర్యమే! లోతున యిప్పుడూ నీళ్లు కనిపిస్తాయి. దానికి మరికొంచెం దూరంలో రెస్ట్‌హవుస్ వుంది.

శ్యామసుందరం రెస్ట్‌హవుస్ వైపు నడుస్తూ, మాయతో ''మనం రాత్రికి పడకలు యిక్కడే ఏర్పాటు చేసుకోవాలి'' అన్నాడు.

''ఇక్కడా?'' అంటూ అమ్మాయిలు యిబ్బందిగా చూసారు. పెద్ద పచ్చిక బయలు మధ్య వున్న వొంటరి భవనమది! క్రిందుగా కృష్ణానది ప్రవహిస్తోంది. ఎటు చూసినా జలమయం. దానికి ఎదురుగా దూరంగా వున్న మ్యూజియం భవనం. రిజర్వాయరును దాటి అవతలకి చూస్తే దూరంగా బారులుగా ఉన్న నీలపు కొండలు. వాటిమీద విశాలమైన ఆకాశం!

ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించే మనస్సు ఉన్న వారికది చాలా అందమైన ప్రదేశం. కాని రాత్రివేళ యీ ద్వీపం మీద తాము మాత్రమే యీ రెస్ట్ హవుస్‌లో కట్టుబట్టలతో వుండాలనే ఆలోచన వాళ్లని భయకంపితుర్ని చేసింది.

మెల్లగా క్రిందవున్న గదుల్ని చూసి భవనం లోపల నుండి బయటకు వచ్చారు అంతా.

''మీరేం భయపడక్కరలేదు. ఈ కొండ మీద వుంటున్న వాళ్ల నడిగి నాలుగు చాపలు తెచ్చుకుందాం. గదుల తలుపులు మూసేస్తే భయం వుండదు. చలీ వుండదు! ఈ రాత్రి గడిస్తే రేపు 'రైట్ బ్యాంక్'కు ఎలా చేరాలా అన్నది ఆలోచిద్దాం! అనవసరంగా ఇప్పటి నుండీ కంగారు పడకండి'' శ్యామసుందరం వాళ్లకి ధైర్యం చెప్పాడు. (ఇంకావుంది)


పర్వీన్ బాబి
ఆమె సౌందర్యపు
రహస్యమును
వెల్లడి చేస్తోంది
100% పాలియెస్టర్ చీరలు
బోంబే డైయింగ్
పర్వీన్ బాబి సౌందర్యపు
రహస్యము ఏమిటో తెలియునా?
బోంబే డైయింగ్‌వారి మైమరపించే
రకరకముల చీరలే 100%
పాలియెస్టర్ మరియు 100%
ప్యూర్ కాటన్—'ఆషియానా'
'షిఫాలా' మరియు 'రేలిక'
BD. 7207

అడిగి చెప్తాను" అన్నారు రామంగారు విషయాన్ని తేలికగా తేల్చేస్తూ.

"లాగేనండి" అని తృప్తిగా ఇంటికెళ్లి పోబో తుంటే రామంగారు ఆపారు. "ఆగండి కాఫీ తాగి వెళ్దురుగాని. . ఏమే. . మా అన్నయ్యగారికి కాఫీ పట్రా అని కేకవేశారు. "ఏమిటండీ" అంటూ వచ్చి విద రంటాయన్ని చూచి ఆగి పోయింది వెంకా

## ఏది నిజం ?

(11 వ పేజీ తరువాయి)

యమ్మగారు. "ఇప్పుడే తీసుకొచ్చాను. ఇప్పుడు మళ్లీ ఎందుకండీ" అంటున్నారు పరంధామయ్యగారు మాటపరనకి లేకుండానే... "అదేమిటండి... కాఫీకేం భాగ్యం ఎన్ని సార్లయినా తాగొచ్చు. ఇపుడే తీసుకొస్తానుండండి" అని లోపలికి వెళ్లి కాఫీ తీసుకొచ్చి రామంగార్ని "ఏమండీ అని పిలవగా రామంగారు లోపలికెళ్లి కాఫీ గ్లాసులందుకుని పరంధామయ్యగారికిచ్చారు. తనోటి తీసుకుని. పరంధామయ్యగారు కాఫీ తాగేసి "వస్తాను" అంటూ వెళ్లిపోయారు తనపనేదో అయిపోయినట్లు.

రామంగారు భార్యతో ఆయన వచ్చిన విషయం చెప్పారు. అది ఎప్పటినుంచో అనుకుంటున్నదే కాబట్టి వెంకాయమ్మగారు పెద్దగా సంతోషించకపోయినా సంతృప్తిగా "అలాగేనండీ" అన్నారు.

సాయంత్రం భోజనాలయ్యాక వెంకాయమ్మగారొచ్చి కొడుకుతో "నాన్నగారు పిలుస్తున్నారురా సుబ్బారావ్"అని చెప్పి భర్త గదిలోకి తీసుకువెళ్లారు. సుబ్బారావు గదిలోకెళ్లగానే "కూర్చోరా. సుబ్బారావ్. . అని కుర్చీ చూపించారు. సుబ్బారావు కూర్చున్నాడు. "ఎందుకు పిలిచినట్లు. . బాగా చదవమని తిట్టడానికా" ఇలా ఆలోచిస్తున్నాడు.

"కమలను నీకిచ్చి పెళ్లి చేద్దామనుకుంటున్నానురా. ." ఉపోద్ఘాతం లేకుండానే మొదలెట్టేశాడాయన. "ఏ కమల" ఆశ్చర్యంగా అడిగాడు. "ఏ కమలేమిట్రా ! మనెదురింటి పరంధామయ్యగారమ్మాయి" అన్నారు. బుర్ర తిరిగి పోయింది సుబ్బారావుకి.

"నాన్నా.. నేనా అమ్మాయిని పెళ్లి చేసుకోలేను" తల దించేసి అన్నాడు.

"ఏం. . ఏమిటి లోటు" లోటేమీ లేనట్లే మాట్లాడారు.

"నేనా అమ్మాయిని ప్రేమించాను" వసిగాడు సుబ్బారావు.

"అయితే ఇంకేం. . మరి పెళ్ళి చేసుకోనంటావేమిటి?"అర్థం గాక విసుగ్గా అన్నారు. రామంగారు.

"ప్రేమించుకున్నవాళ్ళు పెళ్ళి చేసుకోకూడదని నా అభిప్రాయం. . అందుకని ఆ అమ్మాయిని తప్పించి మరే అమ్మాయితోనైనాసరే ఖాయపర్చండి" చదువుకున్న తెలివితేటలుపయోగించి ఏదో ఆర్డరు జారీ చేసినట్లు మాట్లాడాడు. "అదేమిట్రా. . ప్రేమించానంటావ్. . పెళ్ళి చేసుకోనంటావ్. అదేం సిద్ధాంతంరా. . నేను మాటిచ్చేశాను"అబద్ధ మాడేశారు.

"సరిగా ఆలోచించు. . నేనా అమ్మాయిని ప్రేమించాను. . వివాహం చేసుకుంటాననటం పోయి ప్రేమించినమ్మాయిని పెళ్ళిచేసుకోనంటావేమిట్రా!" తికమకపడి పోయారు సుబ్బారావు తండ్రి.

సుబ్బారావు గదిలోనుంచి బయటికొచ్చేసి తన గదిలోకెళ్ళి పోయి కూర్చున్నాడు వాగ్వివాదం ఇష్టం లేక. "ఆత్మహత్య చేసుకోవాలన్పించింది. తను ఆత్మహత్య చేసుకుంటే కమల. ." ఆలోచించలేకపోయాడు కానీ ఆలోచన్లకి అంతేమిటి? "చచ్చి ఏం సాధిస్తాను ? చావటం అవివేకం. . పోసి తన అభిప్రాయం తప్పని రుజువు చేసుకుంటే " ప్రేమవివాహం. విఫలం కాదని రుజువు పర్చాలనుకున్నాడు. "తన అభిప్రాయాలు మార్చుకోవటం ఎలాగ తన అభిప్రాయాలన్నీ స్నేహితులతో పెద్దగా వాదోపవాదాలతో వివరించాడు. పైగా కమలను తను ప్రేమి

మిస్తున్నానని, పెళ్ళి చేసుకోనని ఘంటాపథంగా చెప్పేశాడు. వాళ్ళు తనవెంత హేళన చేస్తారో. ." ఇలా ఆలోచనలతో పదిహేనురోజులు గడిచిపోయాయి. ముహూర్తం కూడా నిశ్చయమయి పోయింది.

కమల క్రీగంట చూడటం. . ముసిముసిగా నవ్వటం చూస్తున్నాడు. తనెందుకో. . నవ్వలేక పోతున్నాడు. "సంఘానికి భయపడుతున్నానా? దేముడే లేడనే వాడ్ని నేను సంఘానికి భయపడట మేమిటి? తన ముభావానికి గల కారణం ఏమిటి?" ఆలోచన్లకి జవాబులు దొరకక ప్రశ్నలుగానే మిగిలి పోయాయి. కమల నూతిలో దూకిన దగ్గర్నుంచి కమలా. . సుబ్బారావులు కల్సుకోలేదు.

"తనేడుస్తున్నా ఇతరులను నవ్వించమన్నారు. తనవల్ల రెండు కుటుంబాలు. . అందులోనూ తను ప్రేమించిన కమల సంతోషిస్తే తనకింకేం కావాలి. తను ఎవరినో ఒకరిని పెళ్ళి చేసుకోవటం తప్పదు కదా! అలాంటప్పుడు ఆ అమ్మాయి కమలే. . ఎందు క్కాకూడదు?" ఇలా సుబ్బారావు ఆలోచనలు నల్ల మబ్బులా ముందుకు పరుగెడుతూంటే "ఒరేయ్.. ఇవిగో శుభలేఖలు. . నీ స్నేహితులందరికీ స్వయంగా అందజేయ్." అంతరాల కడ్డం వచ్చారు రామంగారు.

"పోస్టుద్వారా పంపిస్తానులెండి" ఘనకార్యం చేసేవాడిలా, స్వయంగా అందజేయటం తనవల్లకానట్టు జవాబిచ్చాడు. సుబ్బారావు.

"యేం. . నువు స్వయంగా ఇవ్వవా?" సందేహంగా అడిగారాయన.

"అవసరం లేదు" ఏదవసరమో తనకు తెల్సినట్లుగా అన్నాడు సుబ్బారావు. రామంగారు వెళ్ళి పోయారు వచ్చినంత వేగంతోనూ.

పెట్టె అడుగున దాయాల్సిన వస్తువైనట్లు శుభ లేఖలను బీరువా అడుగు అరలో పెట్టేశాడు స్నేహితులకు పంపించటం యిష్టంలేక, పెళ్ళి ఖాయమైన దగ్గర్నుంచి స్నేహితులంతా హేళన చేస్తారేమోనని బయటికి వెళ్ళడమే మానేశాడు. అయినా స్నేహితులూరుకుంటారా! ఇంటికే వచ్చి కంగ్రాట్యులేషన్స్ చెప్పటంమొదలెట్టేరు. "ప్రేమ. . . పెళ్ళి" గురించి సుబ్బారావు అభిప్రాయాలు తెల్సిన స్నేహితులంతా వ్యంగ్యంగా దుయ్యబట్టేరు "చెప్పేవి శ్రీరంగ నీతులూ." అంటూ. అలా హేళన చేసిన వాళ్ళందరితోనూ ఒకే మాటన్నాడు సుబ్బారావు విరక్తిభావంతో "అభిప్రాయాలనేవి అందరికీ ఉంటాయి. కానీ వాటి ఆచరణలో అందరూ కృతకృత్యులు కాలేరు."

పెళ్ళి రోజు రానే వచ్చింది. 10—21 నిముషాలకు ముహూర్తం. ఇంటి దగ్గరే పెళ్ళి. బంధుజనమంతా చేరవలసిన ఇళ్ళకు చేరిపోయారు. ఇరుపక్షాలకు పందిరొక్కటే కాబట్టి ఆకాశమంత వేయలేకపోయినా, కావలసినదానికన్నా పొడవెక్కువగా వేసి, లైటింగ్ అరేంజి చేశారు. సాయంత్రం ఐదు గంటలయ్యింది. మగపెళ్ళివారికి 'విడిదెక్కడా' అనేది పెద్ద సమస్య అయిపోయింది. 'ఈ రోజుల్లో కూడా విడిది లేమిటిలెద్దూ' అన్నారు కొంతమంది. 'ఆచారం ఆచారమేనని' నిక్కచ్చిగా చెప్పారు కొంత మంది. ఎలాగయితేనేం మగపెళ్ళివారి విడిది మరో వీధిలో ఏర్పాటు చేశారు. విడిది ఏర్పాటు చేసినంత సమయం గాలేదు మళ్ళీ పెళ్ళికి తరలి రావటానికి. జరగాల్సిన పనులు జరిగి పోతున్నాయి సహజంగా.

కనులకు కన్వింపైన పెళ్ళి మందిరంలోని పెళ్ళి పీటలమీద కూర్చోబెట్టారు పెళ్ళికొడుకు సుబ్బారావుని. అపోరకమైన అనుభూతి కల్గుతోందిసుబ్బారావుకిక్కడ. ఇలాగె పెళ్ళికూతురు కమల. తను కోరిన ఆట బొమ్మ దొరకగా ఆనందంలో గంతులు వేసే పసిపాపాయిలా, ఆనందమంతా తనదేనన్నట్లు అప్పుడే విరిసిన కమలంలా తళతళలాడి పోతోంది.

వీనులకు విందైన సంగీతాన్ని సమకూర్చుతున్నారు బాండ్ మేళం వారు. భోగంమేళం వారు చవకబారు సాహిత్యపు గంతులతో కుర్రకారుసంతటినీ అప్సు గోడల్లోని ఆనంద డోలికల్లో ముంచేస్తున్నారు. పెళ్ళికెళితే పేకాట ఆడాలనే నియమం గలవారు తమ పని నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నారు. బంధువులంతా ఒకచోట గుమికూడిన మూలాన భరించలేనంతటి గోల చేస్తున్నారు. కొంతమంది తమ నిత్య జీవిత కార్యక్రమాలకు విశేషాల్ని తగిలించి హరికథలు చెబుతున్నారు.

"ఇక్కడ రూపాయెందు పైసలుంచు నాయనా' "ఈ కొబ్బరి బొండాం పట్టుకో తల్లీ" అంటూ పురోహితుడు మాత్రం దీక్షగా మంత్రాలు చదివేస్తున్నాడు తన ధ్యాసలో. బెల్లం, జీలకర్రా నెత్తి మీద పెట్టించాడు పురోహితుడు. తరువాత కొంత సేపటికి ముచ్చెమటలు పోస్తుంటే ముప్పటగా మంగళసూత్రం ముళ్ళు వేసేశాడు ఎవరూ విడదీయలేనంటటి బలంగా, సుబ్బారావు కమల మెళ్ళో పెద్దలందరు దీవిస్తుండగా. . మేళ తాళాలు మార్మ్రోగుతుండగా పెళ్ళి తంతు పూర్తయింది. రోజులు మారాయి కాబట్టి ఊరేగింపుకు కారొకటి అలంకరించి సిద్ధం చేశారు. కారెక్కించారు వధూవరులను. ఊరేగింపులో కొంతమంది సుబ్బారావు స్నేహితులు 'ప్రేమ పవిత్ర'మని సుబ్బారావు అభి నందిస్తు బలపరుస్తున్నారు. మరి కొంతమంది 'ప్రేమ గుడ్డి'దని వాదిస్తున్నారు. "ఏది నిజం?"

---

## చీకట్లో నేను...

పులివస్తే ఎదిరిస్తాను
పిల్లివస్తే అదిలిస్తాను
చలివేస్తే కప్పుకొంటాను
భవిష్యత్తుపై
భయం వేస్తే...?
చుట్టతీసి
వెలిగిస్తాను
గుప్పు గుప్పున
పొగ వదిలేస్తాను.

— పి. ఆర్ మూర్తి

Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street,

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!

## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

చదువుల్లో అటల్లో హరింపు అయే శక్తిని
పిల్లలను తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక
శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది
ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన
పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది
పుష్టికరమైన **కోకో**, పాలు మాల్ట్ మరియు
పంచదారలతో తయారైన
బోర్న్‌విటా రుచికరమైనది




శక్తి ఉత్సాహం మరియు రుచికోసం **క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

OBM 0449 TEL


ASOKA
REGD
ALL PURPOSE
SANDAL WOOD
Powder
VIJAYA CHEMICALS MADRAS-7
ASOKA
Sandalwood
TALCUM POWDER
VIJAYA CHEMICALS
ASOKA
SANDALWOOD
FACE POWDER
Natt.